శ్రీరస్తు.



శ్రీమద్వీరశైవజనశ్రవణపఠనార్చనోపయుక్తంబగు

# చెన్నబసవపురాణము

అత్తనూరి. పాపకవిప్రణీతము.

శ్రీమదష్టావరణపంచాచారాన్వితుండును భృంగిగోత్రపవిత్రుండును
వీరమాహేశ్వరస్వరూపుం డగు
గంగపట్టణపు సుబ్రహ్మణ్యకవిచేఁ
బరిష్కృతము.



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచేఁ
ప్రకటితము.

1925.

# విషయసూచిక.

పీఠిక.



శ్రీరస్తు.

# చెన్నబసవపురాణము.



పీఠిక.



శ్రీ గిరిజననువధూరో
జాగురుకాశ్మీరపంకిలాంకితవక్షు
శ్శ్రీగిరిమల్లేశ్వరుకృప
దాఁ గందుకురమ్యతలింగధన్యునిఁ బ్రోచున్. 1

ఉ. ఉన్నతకుంభముల్ నిజపయోధర మంద గజాస్యు నంకపీ
ఠి న్నివసింపఁ జేసి బలుకేవ నిజేశ్వరుసాము మేనఁ దా
నున్నెడ మూఁడుమోముల గుహుండు స్తనత్రయ మంచుభ్రాంతినా
స న్నిగుడం దదిచ్ఛ గని నవ్వు భవాని కృతీశుఁ బ్రోవుతన్. 2

చ. ఘనతను దీప్తుఁ డై సమదగండయుగచ్ఛవిదంతకాంతుల
న్వనజభవాచ్యుతాబ్జధరవైఖరి దోఁపఁగఁ జేసి యేసె చూ
గనుఁగొనఁగం ద్రిమూర్తులకుఁ గారణమై తగుమూర్తి నంచుఁ బెం
పెనయు గజాస్యుఁ డీవుతఁ గృతీశున కీప్సిత మాదరంబునన్ 3

చ. అరిధరణీధ్రదైన్యశరదాఘనవామయగంధవాహభీ
కరకులిశానలాగ్ని ఘణికల్పితగాత్రనఖాళిపక్షదు
ర్ఖరవిషమాక్షవాలముఁ బొటిలుశ్రీశరభాంకసాళువే
శ్వరుఁడు కృతీశుఁ గీర్తిబలశౌర్యశుభాన్వితుఁ జేసి ప్రోవుతన్. 4

ఉ. విశ్వకళాప్రవీణపరివీరుఁడ నీకుఁ గృపాణవైన తే
యాశ్వశిలీముఖాంఘ్రికమలామలభక్తధురీణసత్కృపా
శశ్వదురీక్షకోణ యని సారెకు నామదిఁ దాఁడికొంపనం
దీశ్వరు మద్గురుం దలఁతు నెప్పుడు తా నుపదేశికాత్మజున్. 5

సీ. కందర్పముఖదేవసందోహవినుతగోవిందాస్త్రవహానాభినంది నంది
రంగద్భుజంగేశ్వరాంగదపదపద్మసంగతమానసద్భృంగి భృంగి
సుద్రనిరాకృతిక్షుద్రదక్షవితానవిద్రావణక్రియాభద్రు భద్రు
గాండసంభవకాండఖండనదూషకకాండసంహరణప్రచండు చండు
తే. సర్వసర్వంసహాచక్రశైలగేహ
భక్తమానససంశయభారతిమిర
పటలబోధాంబురుహసుహృత్ప్రభుని బ్రభుని
బూని వినుతించెదఁ బ్రణామపూర్వకముగ. 6

మ. వరసర్వజ్ఞశిఖామణిన్ బ్రథితసద్వారప్రమోదాకరున్
నిరతోద్యచ్ఛివధర్మసంచరుఁ గళానీకాంచితావాసు భా
స్వరలింగాన్వితదేహు సర్వవిబుధవ్రాతామృతాధారు భా
సురపాదుం గళితారిఁ బాల్కురికివంశ్యున్ గొల్తు సోమాహ్వయున్.

మ. వరవల్మీకజ నన్నపార్య ముఖగీర్వాణాంధ్రభాషాకవి
త్వరమాంభోనిధులం జనాత్తియుగజీవంజీవతోషక్రియా
కరతేజోవిధులం నిజానుపమవాక్యవ్రాతసంపాదనా
స్ఫురదాశాంబుధులం దలంతు సతతంబున్ గార్యసంసిద్ధికిన్. 8

క. అని యిష్టదేవతాప్రా
ర్థనమును గురుస్తోత్రమున్ బురాతనగణప
ద్వనజాభివందనము కవి
జననుతిఁ గావించి యక్కజం బగువేడ్కన్.

సీ. కమనీయధర్మార్థకామమోక్షసుఫలానీకంబునకు సురానోకహంబు
బంధురవిజ్ఞానభక్తివైరాగ్యనిష్ఠామూర్తికములకు శంబరనిధి
సాంఖ్యయోగాదికచందనభూమీరుహావళులకు మలయాచలంబు
సలలితసాలోక్యసామీప్యసారూప్యసాయుజ్యముక్తివజ్రములకుగని
తే. యైన శ్రీచెన్నబసవప్రధానుభవ్య
చరిత మస్మద్గురూత్తమ సత్కటాక్ష
గరిమ నానేర్పుగతి జిహ్వ పరమపావ
నత వహింపఁగఁ జెప్పఁ బూనంగ నంత. 10

సీ. తనయశస్స్ఫూర్తి శీతనగాంబుజాతజా
త నభోవలగ్న లఘునతఁ దెగడుఁ
దనశౌర్యకలన శంతనుసూను కీచకే
తన జమదగ్ని నందనుల నొంచుఁ
దనరూపగరిమ శ్రీతనయు నైషధ జయం
త నలకూబరుల వాదున జయించుఁ
దనయీగి రాత్రికాంత నరవాహన దైవ
తనగ కర్ణుల లెక్క గొనక నెగడుఁ
తే. దనవచోగరిమంబు ధా తనగఁ జాలుఁ
దనప్రతాపంబు సూర్యు నెం తనఁగ నోపు
దనరు శ్రీ కందుకూరివంశాబ్ధిచంద్రుఁ
డరితిమిరహేళి యమృతలింగార్యమౌళి. 11

వ. మఱియు సమస్తసిద్ధవిద్యాధరపరివృతుండును ననంతామరసంస్తూయమానుండును బరభూభృత్పక్షచ్ఛేదనదక్షుండును గమనీయసుధర్మాధివాసుండును నిరంతరగురువాక్యానుసారప్రచారుండును హస్తగతశతకోటిసాధనుండును నందనవిహారసంజనితప్రమోదస్వాంతుండును శుచిసమవర్తిపుణ్యజనధనేశమహాబలధనాధ్యక్షసర్వజ్ఞాసమాకీర్ణుండునునగునమ్మంత్రిపురందరుం డొక్కనాఁడు శ్రుతిరంజకవిప్రవరవిహారకోలాహలంబై నిరుపమామోదసుమనోవిలాసభాసురంబై యశ్రాంతకమలాంచితాలవాలంబై సులలితసిద్ధరాభినయనవిహారమూలంబై యాశ్రితాళిమనోరథపూర్ణాకారంబై కల్పవృక్షంబన నొప్పునాస్థానసౌధరాజంబున జ్ఞాతి బంధు మిత్రామాత్య పురోహిత సామంత దండనాయక కవి పండిత పౌరాణికేతిహాసక పాఠక పరిహాసక తాంత్రిక భిషగ్వైణిక వాంశికనర్తక మురజికవైతాళిక వందిజనపరివేష్టితుండై, మణిఖచితకార్తస్వరసింహాసనంబున నొడ్డోలగంబున్న సమయంబున నిజపితృపితామహాదులుమున్నందినసత్కృతులు ప్రసంగవశంబున సభాసదులైనబుధజను లుపన్యసించిన విని సంతోషస్వాంతుండై సప్తసంతానంబులలోఁ గృతియ యుత్తమోత్తమంబుగావున నే నొక్కప్రబంధంబు గైకొనిధన్యుఁడఁ గాకయని తలంచి

తత్ప్రాజ్ఞులకు నిజాభిలాషం బెఱింగించిన వార లిట్లనిరి. 12

మ. అనఘా! మీరు దలంచినట్టితలఁ పార్యాభీష్ట మాప్తాళిరం
జన మంహోవిదళనం బమేయఫలకృత్సంతానముఖ్యంబు గా
వునఁ గీర్త్యాస్పద మైన యొక్కకృతి నీవు న్వేడ్కఁ గైకొమ్ము ముక్
ఘనతాసింగయబాచయాదిసచివౌన్నత్యంబునం జెందెడిన్. 13

ఆ. సుగుణసత్కవీను శుభవాక్యసర్వల, శుణధురీణుసరసకావ్యరచను
వీరశైవగ్రంథవేత్త తేజస్విగా, నెఱిఁగియందుమాతఁడిచ్చుసుకృతి.

చ. అనవుడు మంచహాసవదనాంబుజుఁ డై యపుడత్తలూరిపా
వనకుల జక్కిరాజునకుఁ బౌత్రుఁడ శ్రీగిరిమంత్రిమౌళికిక్
ఘనమతి సుందరాంబికకు నందనుఁ డబ్బసవేశుఁడే యనం
జను బసవేశుమంత్రి కనుజన్ముని బాపయసత్కవీంద్రునిన్. 15

క. ననుఁ బిల్వ బంచి తగు తెఱఁ
గునఁ బూజ లొనర్చి యిష్టగోష్ఠి వినోదం
బునఁ గొంతప్రొద్దు గడపిన
వినయవచోగరిమ ననియె వేడుక నాతోన్. 16

చ. శివకరుణాకటాక్షమునఁ జేకుఱెఁ దక్కినయట్టిసంతతుల్
కవిజనహృద్యముక్ భువనగణ్యము భక్తిరసోల్బణక్రియా
భవనము కిల్బిషప్రకరపాటన మై తగునొక్కసత్కృతిక్
దవిలె మదీప్సితం బిపుడు దాన మనోరథపూర్తిఁ జెందెడిన్. 17

క. సంతానభూజములలో, సంతానం బైనయట్టిసత్కృతి నీచేఁ
గాంతుననికోర్కెఁ జెందితి, సంతసమున నొసఁగవలయుసరసకవీంద్రా!

మ. అని జాంబూనవసిర్మితాంబర మణీహారాగ్రహారాశ్వచం
దనవీటీ చతురంతయాన సుమనోధామాదివస్తువ్రజం
బున న న్వేడ్క బహూకరించుటయు నేఁ బూర్ణానుమోదంబుతో
ననఘం బైన తదీయవంశకథనం బాసక్తి వర్ణించెదన్. 19

కృతిపతివంశవర్ణనము.

క. హృతకాముఁడు యుతవారిజ
హితధాముఁడు విష్టపత్రయాభరిత యశో

జితసోముఁడు ధారుణిలో
హితనాముఁడు వెలయు సన్మునీశాగ్రణి యై. 20

క. అబ్బానసవాలుకులమున, బిబ్బోకవతీస్మరుండు పృథివితరుణిహా
నిబ్బరుఁడరిమృగతతికిం, బెబ్బులియన నప్పమంత్రి పెంపొందుధరన్.

క. ధీరుఁడగునప్పమంత్రికి, వీరేశ్వరుఁ డనఁగ నుద్భవించెను సుజనో
ద్ధారుం డాతని కాత్మజుఁ, డై రంజిలె నప్పసచివుఁ డతిధార్మికుఁ డై.

ఆ. అప్పమంత్రిభార్యలైనపార్వతియందు, గంగవలననుతులఁగనియెజగ్గ
మాభిధానుమతిఁయునమృతకవీంద్రుని, శ్రీగిరీశ్వరునివిశేషమతుల.

ఉ. అందులఁ బార్వతీతనయుఁ డై చెలువొందిన జగ్గనాహ్వయుం
డిందుధరాంఘ్రిభక్తి ధరణీశవశీకృతమంత్రశక్తి మె
చ్చందగు సూనృతోక్తిఁ గరసాహసభోగకళాధురంధరుం
నందను రామకృష్ణ ఘననాముని గాంచె జగత్ప్రసిద్ధిగన్. 24

చ. ఘనుఁ డగురామకృష్ణుని వికాసమనీషకు మెచ్చి సంతసం
బునఁ ద్రిజగత్ప్రతాపకులభూషణరాయుఁ డనంగ మేటిపే
రును మణిభూషణంబులు హరుల్ గజదంతపుఁబల్లకీలఁ గొ
మ్మని దయ గోలకొండవసుధాధిపుఁ డాతని కిచ్చె హెచ్చుగన్.

సీ. భూనుతకీర్తియాభూషణరాయండు పాలనగరరాజ్యమేలుచుండి
నిడుదవోల్సీమలోనిరుపమవాసిష్ఠ తటినీతలంబున ధరణిసురుల
కగ్రహారములు కల్పాంతరస్థాయిగా నొసఁగి వనీపకవిసరములకు
వాంఛితార్థంబు లవ్వారిగా నొసఁగుచు బంధుల నరయుచు బహుళ [పుత్ర

తే. పౌత్రకల్యాణవృద్ధిచేఁ బరిఢవిల్లెఁ
గాంతిజితహేళి శివపాదకమలజాళి
దళితదురితాళి నిరుపమదానకేళి
రమ్యగుణపాళి భూషణరాయమౌళి. 26

తే. అప్పనకుఁ బిన్నయాలైనయట్టి గంగ
కుద్భవించిన యాత్మజయుగ్మకమున
నమృతకవిచంద్రుఁ డలరు ప్రఖ్యాతి మీఱి
యరివిభేదియు ఘనతమోహరణుఁ [illegible]. 27

క. ఆతఁడుకొండాంబికయం, దా[illegible] సదాచారగుణో

పేతుని బేరయలింగా, ఖ్యాతామాత్యాగ్రగణ్యుఁ గనిసిరులొందెన్.
క. పేరయలింగామాత్యుఁడు, భూరియశోలలిత మల్లికపూఁడి కులజుఁడౌ
వీరనసుత యగుకొండక్, భారతిఁ బరమేష్ఠిపగిదిఁ బరిణయమయ్యెన్.
క. ఆతన్వియందుఁగనియెక్, బాతకసంహరణచణులఁ బార్థివఘనులక్
ఖ్యాతికళామృతలింగ, జ్యోతిర్లింగాభిధానసూనృతగుణులన్. 30
మ. అమృతామాత్యుఁడు బుద్ధిరాజుకులపద్మాదిత్యుఁడౌ పర్వతుం
డమితామోదముతోడఁ గన్నగురువాంబాసాధ్వి కే ల్పట్టి త
త్ప్రియదారత్నమునందుఁ గాంచె తనయుక్ భావాంతరస్థాద్రిజా
రమణుం బేరయలింగమంత్రి శశభృద్రామేయసౌందర్యునిన్. 31
ఉ. పేర్కొన నొప్పు కందుకురి పేరయ సత్ప్రభుచక్రవర్తి క
ర్ణార్కసమానకీర్తి మఘవాత్మజతుల్యవిలాసపూర్తి దు
ష్కర్కశవైరిసంఘభయకారణమూర్తి పరాంగనాళిసం
పర్కవిచారకల్మషవిభంజనసత్ప్రథవర్తి ధారుణిన్. 32
తే. భవ్యగుణధుర్యు ముదిగొండ పర్వతార్య
వరవిశాలాక్షులకుఁ గల్గు వనజగంధి
వీరమాంబను వరియించె విభవ మెసఁగ
సంగజాకారి పేరయలింగసూరి. 33
ఉ. పేరయలింగమంత్రి తనప్రేయసియైన తగు వీరమాంబికా
సారసగంధియందు శుభచర్యుల మేరుసమానధైర్యులక్
వారిధితూణభక్తుల దివాకరకాంతిసియుక్తులక్ సిరుల్
చేరఁగఁ గాంచె శ్రీయమృతలింగశుభాహ్వయు మల్లికార్జునిన్. 34
క. ఆయిరువురయం దగ్రజుఁడై యలరిన యమృతలింగమహితావనిభృ
న్నాయకభయదాయకవా, క్నాయకుఁడై యేలెనునరసాపురమెల్లన్.
సీ. అతిధార్మికుం డైన యమ్మంత్రివర్యుఁ డశేష జగంతప్రసిద్ధి గాఁగ
మేటియౌ తనపేర పేట మాదేపల్లె కాట్రేనిపల్లెయక్ గ్రామములను
రహి గుడుల్ కట్టించి రామలింగేశ శరభ మల్లేశ్వర శరభ మల్లేశ్వరాఖ్య
శుభలింగప్రతిష్ఠలు సేసి శర్వపురాద్యగ్రహారము లవనిదివిజ
తే. వారములకిచ్చి సర్వాధికారకర్త
వంశవర్యుంకి కొవాహాథపళ చాము

తాతపత్త్రాదిబిరుదచిహ్నములు మెఱయఁ
బూజ్యసామ్రాజ్యభోగవిస్ఫూర్తిఁ దనరె. 36
ఉ. శ్రీముదిగొండవంశసరసీరుహభాస్కర వీరనార్య పు
త్త్రీమణి సంతతాశ్రిత సుధీజన యాచకబంధులోకచిం
తామణి నాఁగ సర్వవసుధాస్థలి నెన్నికఁ గన్న సోమమాం
బామహిళ న్వరించె మును పద్మ వరించిన కృష్ణు కైవడిన్. 37
క. సత్యవ్రతు లగువారిక్కిఁ, గాత్యాయనివరునికరుణఁ గలిగిరి కాంత్యా
దిత్యులు పేరయలింగా, మాత్యుఁడు వీరేశలింగమంత్రియు ననఁగన్.
ఆ. పృథివి నెన్నఁదగిన పేరయలింగంబు, బొమ్మకంటివంశ బుచ్చిరాజు
తనయ యైనయట్టినన్నఁబోణి శ్రీవిశాలాక్షిఁ బెండ్లియాడి యలరె సిరుల.

సీ. అతనికి నవరజుఁ డైనవీరేశ్వరుం
డవనిఁ బ్రఖ్యాతిచే నలరి సత్క
ళాశాలి కవ్వాలి లక్ష్మీపతికి సుతా
రత్నమౌ వీరమ్మ రమణిఁ బెండ్లి
యాడి యబ్బింబోష్ఠియం దమృతాఖ్యకు
మారు శూరు నుదారు మేరుధీరుఁ
గనియె నాతఁడు మానఘనుఁడైన ముదిగొండ
గౌరన్నపుత్త్రియై గణుతి కెక్క
తే. పర్వతమఁ బెండ్లియాడి తత్పర్వహిమక
రాస్యయందునఁ గనె మల్లికార్జునాఖ్య
లేఖకాగ్రణి పేరయ లింగసచివ
సార్వభౌమునిఁ బార్వతీశ్వరునికరుణ. 40
తే. అనఘతరదాని యగుమల్లికార్జునుండు
మూర్తి ముదిగొండ శరభన్నకూఁతు సుంద
రీసతీమణిఁ బెండ్లియై భానుసత్త్రి
మూర్తులను బోలు తనయుల ముగురఁ గనియె. 41
తే. అగ్రజుం డొప్పు నమృతలింగాహ్వయుండు
నైపుణను రెండవసుతుండు పాపరాజు

పరగ మూఁడవతనయుండు శరభమంత్రి
దానమానయశోభాగ్యధైర్యయుతులు, 42

సీ. వరమల్లికార్జునావరజుఁడై తగు వీర
 సామాఖ్యుండు బుద్ధిరాజామృతారు
జనసుతవియ్యంబ వరియించి యమృతలిం
 గాహ్వయద్వయము మల్లన్న బసవ
రాజు పాపయ్యను రసికుల నేపుర
 సూనృతవాక్యుల సుగుణయుతులఁ
గరుణాసముద్రులఁ గాంచి స్యవంతులఁ
 గని మహదైశ్వర్యగరిమ గాంచె

తే. వీరకూటస్థుఁ డగునట్టి వీరసామాఖ్య
మంత్రివల్లభతనయుండు మల్లికార్జు
నాహ్వయుం డొప్పు నమృతలింగాహ్వయుండు
వంశభూషణమణి జనావళి నుతింప. 43

సీ. నేర్చినాఁ డేజాణ సింధుకాశ్మీరాదిబహుళదేశామేయభాషణములు
చేర్చినాఁ డేమేటి శీతాచలాత్మజావరపాదయుగళి హృత్సరసిజమున
దీర్చినాఁ డేమంత్రి ద్విజవరాధీశాది సకలవర్ణాశ్రమాచారసరణి
కూర్చినాఁ డేదాని కుంభినీవ్యోమాష్ట హరిదంతరాళసంభరితకీర్తి

తే. యతఁడు పొగడొందఁ గందుకార్యన్వవాయ
కలశవారాశిపూర్ణిమాకైరవాప్త
వీరయామాత్యతల్లజ వీరమాంబి
కాబ్జభవనాత్మజుఁడు మల్లికార్జునుండు. 44

ఉ. ఆతతకీర్తికై కుమారయామాత్యచరిత్రకృతిం గ్రహించి ప్ర
స్ఫీతము లైనకొత్తపలియు వెట్టనాఁ డను నగ్రహారముల్
ఖ్యాతిగఁ జేసి బంధులకు గ్రాససమృద్ధు లొసంగి శాంభవ
వ్రాతముకోర్కు లిచ్చి విభవంబున మల్లనమంత్రి వర్ధిలెన్. 45

సీ. ఆతఁడు కాంత్యాదిగుణాఢ్యుఁడై సోమయాజు
 [illegible]

పల్లియన్ దుర్గముల్ పాలింపుచుండి కొ
మరవోలుమూర్తికొమార్తె సద్గు
ణాలంబ దుష్కలుషావనీధరశంబ
యగుగుయవాంబఁ బెండ్లాడి శోభ
నాంగులఁ బేరయలింగంబు నమృతలిం
గంబు వీరేశలింగంబు సాళ్వ

ఆ. పతియు మూర్తిరాజు బసవరా జన నొప్పు
సుతుల సుజనహితుల సుఖసహితుల
నతులవిభవయుతుల నార్వురఁ గనియె నం
దగ్రజుండు పేరయాహ్వయుండు. 46

ఉ. బాలశశాంకమౌళిపదపద్మసమర్చనశీలి సత్కళా
శాలి మదాంధశత్రుపరిషద్గహనోద్భటకేలి యాత్మభా
హేలి నిరంతరాశ్రితమహీసురపాళి సుసద్గభీరతా
వేలి యనంగఁ దేజరిలుపేరయలింగము మంత్రిమాత్రుఁడే?. 47

తే. అతఁడు శ్రీబుద్ధిరాజవంశాక్కరాజ
పుత్రి సోమాంబికానామఁ బుణ్యసీమ
విశ్వపాపవిరామ సాధ్వీలలామ
వరగుణస్తోమఁ బ్రేమ నుద్వాహమయ్యె. 48

ఉ. ఆతనితమ్ముఁడైనయమృతాహ్వయుఁ డీశ్వరతత్త్వవేది భూ
నేతృసభాంతరాళినుతనిర్మలసూనృతవాది లోకవి
ఖ్యాతకళావినోది సమదాంధవిరోధివిభేది సంతతో
పేతశుభప్రమోది కడుఁ బెంపు వహించె ధరాతలంబునన్. 49

ఉ. పుణ్యచరిత్రుఁ డాత్మకులభూషణుఁ డౌనయగారిభద్రస
ద్గణ్య సుతావరేణ్య సతతాశ్రితదీనశరణ్య భవ్యలా
వణ్య సమస్తబంధుజనవర్ణితనాయకహర్షదాయిసా
ద్గుణ్య [illegible]రించె పియ్యమని [illegible]సుకోరిక సమ్మదాత్ముఁడై.

క. తత్సోదరుఁ డాకృత్యవి, భిత్సూనుఁడు కీర్తివిజితభిదురాబ్జకళా
భృత్సింహుఁడు వీరేశుఁడు, పత్సాకసవినమితాంఘ్రి ప్రబలె సిరులఁచేన్,

సీ. మహితపంచాక్షరీమాహాత్మ్య మనుకృతి
యంది త్రైలోక్యవిఖ్యాతిఁ గాంచె
నతిభక్తి శ్రీశైలమందు మాసులు మెచ్చ
సంవత్సరము నివాసంబు చేసె
నిష్ఠాగరిష్ఠుఁ డై నేఁడు నాఁ డనక సాం
ఖ్యమహేశ్వరార్చనఁ దా నొనర్చె
హితులఁ రక్షించి యహితుల శిక్షించి భూ
పతుల వశ్యులఁ జేసి చతురుఁ డయ్యె
తే. నితని కెన యైనమంత్రు లీక్షితితలమునఁ
గలరె! యని సర్వజనములుఁ బలుక నెగడెఁ
గందుకురి మల్లికార్జునంనపనుండు
సంగరగుహుండు వీరేశలింగవిభుఁడు. 52

మ. అనఘుం డాతఁడు విన్నకోటవరవంశాంభోధిశీతాంశుఁ డౌ
ననఁ బెంపొందిన భీమరాజసుతయౌ నక్కాంబికాకాంత స
జ్జనసంస్తుత్య యశోనిరాకృతసుధాసత్కాంత సుద్వాహ మై
కని యెల్ల మల్లయ పేరయాహ్వయులఁ దత్కంజాక్షియం దిద్దరన్.

ఉ. అగ్రజు మల్లికార్జునుఁ డహార్యవిఖండనతుల్యవైభవుం
డుగ్రసమర్చనానిరతుఁ డూర్జితసత్యవచోవిశాలుఁ డ
త్యాగ్రహవైరిసంహరణుఁ డంగజసన్నిభరూపవంతుఁ డా
శాగ్రణితాచ్ఛకీర్తి గుణశాలి తలంప నమాత్యమాత్రుఁడే?. 54

సీ. శివశైవుల కెల్ల వెండిబంగరులింగ
మేటిసూత్రంబు లేమేటి యొసఁగె
శతములసంఖ్య దంపతిపూజ లొనరించి
శాటికాంబరము లేసచివుఁ డిచ్చెఁ
గమనీయమారత్నకాంచననైచిక
ప్రముఖదానంబు లేప్రభువు చేసె
సతతంబు షడ్రసహితాన్నములు భక్త
గణతృప్తి యేమంత్రిమణి యొనర్చె

తే. సతఁడుఁ గొనియాఁడఁ దగుమల్లికార్జునుండు
కోరి ముదికొండయన్నయ్యకూఁతు రైన
వియ్యమాచంద్రవదన వివేకసదనఁ
బెండ్లియాడి ధరాస్థలిఁ బెంపుఁ గనియె. 55

క. ఆరసికుని యనరజుఁ డగు, వేరయలింగప్రధాని పేర్కొన నొప్పున్
శారదఘనసారదఘన, సారదళనకీర్తిసహితుఁడు సభలన్. 56

ఉ. శాంతుఁడు దుష్టభావరిపుసంఘమదాంధతమిస్రపద్మినీ
కాంతుఁడు భవ్యరూపజితకంధరవాహనసంభవైణభృ
త్కాంతుఁడు సంతతాశ్రితబుధప్రకరావనతారణేందిరా
వంతుఁడు సారధైర్యహిమవంతుఁడు వేరయ మంత్రియే సుమీ. 57

సీ. ఆతఁడు శ్రీబుద్ధిరాజాన్వయశ్రీశైలపతిసుత కామాక్షివలన సుతులఁ
బేరయలింగంబు వీరేశలింగంబు బసవరాజన నొప్పు భవ్యగుణులఁ
గనియెముప్పురనగ్రగణ్యుఁడౌ పేరన్న బుద్ధిరాజయ్యన్న పుత్త్రిఁ దాయ
మాంబిక వరియించి యవని యేలుచునుండె వీరన్న గండ్రపువీరరాజు

తే. తనయ వియ్యాంబకే ల్పట్టి ఘనతఁ బ్రబలి
బహుళవిఖ్యాతిఁ గనుచుండె బసవరాజు
బుద్ధిరాజవీరేశ్వరు పుత్త్రియైన
వియ్యమాంబను వరియించె విదశమతిని. 58

తే. మఱియుఁ బేరయలింగాఖ్యమంత్రి పిన్న
యతివ యెద్దనపూఁడి నారప్పపుత్త్రి
యైన కామాక్షివలన మల్లయ్య మొదలు
గాఁగలుగునందనులఁ గాంచి ఘనత నెగడె. 59

తే. సుగుణులగు మల్లికార్జునసుతులలోన
నాలుగవ నందనుండగు సాళువపతి
సంతతాత్మీయహృదయపద్మాంతరాళ
సంచరత్సాళువపతి ప్రశస్తిఁ గాంచె. 60

శా. ఢిల్లీనాయకుచేత దంతిహయధాటీముఖ్యవస్తువ్రజం
బెల్లం గైకొని కాశికాప్రముఖగౌరీశాదనుల్ గాంచి ని
త్యోల్లాసంబున శంకరార్చనలు దివ్యల్ మెచ్చఁ గావించి సం

ఫుల్లాంభోరుహలోచనావదనుఁడై పూషప్రభఁ వర్ధిలెన్. 61

ఆ. అయ్యమాత్యవర్యుఁ డతిమోహమున భావ
రాజకులవతంస రామచంద్ర
పుత్త్రియైన లక్ష్మిఁ బురుషోత్తముఁడు లక్ష్మిఁ
బెండ్లియాడురీతిఁ బెండ్లియాడె. 62

తే. భువనవిఖ్యాతిగలవారి పుత్త్రి యగుట
సత్కులశ్లాఘ్యులైనవాత్మకసహజ యగుట
భవ్యగుణపురుషోత్తము భార్య యగుట
లక్ష్మియే యన వచ్చు నీలక్ష్మి నవని. 63

క. సరసుఁడు హాళువపతికి న, వరజుం డగుమూర్తిరాజు వర్ధిల్లె రహిం
బురహరకులధరచలహార, ధరధరనలశరసమాన ధవళయశుండై.

సీ. బిరుదముల్ నృపతిచేఁ బెదతండ్రివలెఁ గాంచి
నత్యున్నతమగు స్వాస్థ్యము ధరించి
గురువరులకు సింగపుర మనుపుర మిచ్చి
పరసమయాగుల కెల్ల వన్నె దెచ్చి
నగణితభక్తగణార్చనములఁ జేసి
యవనిభారము భుజమందు మోపి
లింగాంగసమరససంగతి నుతి కెక్కి
ప్రమథకథాశ్రవణమునఁ జొక్కి

తే. సప్తసంతతు లొనరించి శాంతి మించి
యరులఁ బరిమార్చి పౌరులసిరుల కోర్చి
కుజనసంగతి మాని సద్గుణము పూని
కీర్తిఁ గనె వాక్యగోత్రోజ్జ మూర్తిరాజు. 65

క. అన్నమునకు బరువక తా నున్నపుడెల్ల లింగధారి యొకఁ డుపవాసం
బున్న నుగుడుపవ్రతమున, నెన్నికపల్లోపఁగ వారి కెల్లమునదమునన్.

ఉ. ఆమ్మను మంత్రమాన్యుఁ [illegible] మృతాంశుముఖాస్యుఁడు సమ్మదాత్ముఁడై
తుమ్మలపల్లి వంశప్రశస్తుం డగు [illegible] యుద్భవట్టి దే
[illegible] నొప్పనుగ [illegible] సుస్పృహాముయ్యె భారతిం
[illegible] ప్రవ [illegible] బెండిలి యైన [illegible] ప్పునన్. 66

సీ. పలుకువేళల సత్యభాషణంబె కాని యనృతవాక్యము జిహ్వ నంటనీదు
భక్తిపూజలు సేయుపట్ల నోపిక కాని మేన రాజసవృత్తి పూననీదు
దీనులకన్నంబు పూసిపెట్టెడువేళఁ జేత సంకోచంబు చెందనీదు
పెనిమిటికినుక చేసిన సంతసమె కాని చిడిముడి మనసునఁ జెందనీదు
తే. సర్వసర్వంసహాపుణ్యసతులలోన
నిమ్మహాసాధ్వియే గణియింప మేటి
యనఁగ నుతి కెక్కె మూర్తిరాజ్యనుగుఁబోటి
మహితగుణకోటి శ్రీపేరమావధూటి. 68

క. అమ్మూర్తిరాజుమంత్రికిఁ, బమ్ముఁ దగుచు బసవరాజు ధర వర్ధిల్లెన్
దమ్ములదొరకెంపుల మొ, త్తమ్ములదొరయైనసత్ప్రతాపోన్నత్యుఁడై.
సీ. నారదప్రభ మించి నారదప్రభ నెంచి యమరినకీర్తిదానములవాఁడు
చిత్రభానునిమీఱి చిత్రభానుని గేరి పరగుసుచిత్ప్రతాపములవాఁడు
భీము పెంపును గెల్చి భీము పోఁడిమి మెచ్చి వఱలినభూతిసత్త్వములవాఁడు
ధర్మగర్వము ద్రోచి ధర్మగర్వముఁ బూఁచి తగుశివభక్తిసత్త్వములవాఁడు
తే. జగతిఁ జెలువొందె నుదయాస్తశైలసేతు
శీతనగమధ్యరాజత్ప్రభాంతరాళ
వినుత సుగుణుండు మల్లికార్జునసుతుండు
మహితధృతిశాలి బసవరాణ్మంత్రిమౌళి. [సం

క. ఘనముగ నైతమపూఁడియు, మినుమించ లిఁపాఁడు సిరులు మించంగ నొ
గెను గురుచరవరులగు బస, వనితో నెనయైనమంత్రి వసుధం గలఁడే.
క. తనమేనయల్లుఁ డాప్తత, వినయుం డగుబుద్ధిరాజు వీరనచేతన్
గొనె సత్యవతీపరిణయ, మనుకృతి శ్రీబసవమంత్రి యతిసంప్రీతిన్.
సీ. శరభమల్లేశ్వరస్వామిఁ బ్రతిష్ఠించె నైతమపూఁడియం దధికభక్తి
నారామనిధితటాకాదులై తగు సప్తసంతతులొనరించె శాశ్వతముగ
రెండవబసవేశ్వరుం డన లక్షలసంఖ్య గణార్చనల్ సలిపె నిష్ఠ
సాళువేశ్వరకృపాసంలబ్ధఘనతరభోగభాగ్యముల విస్ఫూర్తి నలరె
తే. సీతఁ డని యెన్నఁదగియె ధరాతలమున
నతిఫలద సోమవాసరవ్రతయుతుండు

మల్లికార్జునగురుపమాంబాత్మజుండు
శరణసమధాని బసవరాజప్రధాని. 73
ఆ. రసికుఁ డతఁడు బుద్ధిరాజకులాగ్రణి
వీరభద్రతనయ వియ్యమాంబ
సకలబంధువినుత సద్గుణనికురుంబ
ప్రేమ మదిఁ దలర్పఁ బెండ్లి యయ్యె. 74
ఉ. ఇంతులు సాటి వత్తురె మహీస్థలి వియ్యమతోడ సత్కృపా
శాంతగభీరశీలపురసంహరభక్తసమర్చనక్షమా
శాంతవికీర్ణపూర్ణసతతాశ్రితపోషణసత్యభాషణా
శాంతనిజేశభక్తబుధసంఘముఁ దావహాసువ్రతంబులన్. 75
తే. అనఘుఁ డైనట్టిబసవరాజునకు వియ్య
మాంబికకు నుద్భవించిరి యబ్జభూష
ణాంఘ్రిసేవాభిమతులు మల్లయ్యమూర్తి
రాజు వీరేశలింగ మఱి రసికవరులు. 76
క. ఆనుపూర్విని లో నగ్రజుఁ డై మెఱసినమల్లికార్జునామాత్యుఁడు స
త్త్వాముఁడు తేజోధాముఁడు, ధాముఁడు కీర్త్యాకృతిప్రతాపగుణములన్.
తే. అతఁడు శ్రీబుద్ధిరాజు వీరార్యతనయ
విశ్రుతనయ వీరాంబను బెండ్లియాడి
సద్గుణనిధాని బసవరాజప్రధానిఁ
గనియెఁ గలశాబ్ధి చంద్రునిఁ గన్నపగిది. 78
ఆ. భూతిసాతిసత్త్వవీతులఖ్యాతిచే, వారిజారిధారిసౌరిశౌరిఁ
గేరి మీఱుకందుకహారిబసవరాజు,తోడ నీడు సేయుపోఁడి గలఁడె.
క. అక్కలుషహరుఁడు వాగ్మిత, వాక్కాంతాధిపుఁడు బుద్ధిరాజు బసవన్నసుతన్
మక్కువ నెక్కొనఁ జక్కని, యక్కాంబాదేవిఁ బెండ్లియైసిరులొందెన్.
తే. అతనికినతండ్రి మూర్తిరాజాహ్వయుండు
విశ్వరాజసభాంతర వినుతి గాంచెఁ
దామరసజాండభరితప్రతాపచండ
కిరణవికసితనిజకీర్తికిరణుఁ డగుచు. 81
సీ. దానఘనంబున మానధనంబున రాజరాజప్రభఁ బ్రబలువాఁడు

సత్ప్రతాపంబున సాహసరూపంబున నలరాజకలనేత నలరువాఁడు
భరితకళాపూర్తి బాహుస్థలస్ఫూర్తి రేవతీరమణుని ఠేవవాఁడు
తతమంజుతరభూతి ధైర్యసమాఖ్యాతి చంద్రధరాభప్రశస్తివాఁడు
తే. ధాత్రి నితఁడన నెగఁడె సుత్రామముఖ్య, దేవకోటీరమణిసుప్రదీప్తపాద
భైరవేశ్వరదత్తసంపత్ప్రమోద, సౌఖ్యశుభశాలిమూర్తిరాట్సచివ
తే. రసికుఁ డాతండు శ్రీబుద్ధిరాజు బసవ [మౌళి.
రాజపుత్రిక్షమాధాత్రి రమ్యగాత్రి
నచ్చమను బెండ్లియాడి యయ్యతివయందు
బసవరాజాదులను గని ప్రబలె సిరుల. 83
శా. ఆమంత్రీశ్వరు తమ్ముఁ డొప్పు మిహికాహార్యాత్మజాధీశ్వరా
ర్చామోదాత్ముఁడు కందుకూరికులదుగ్ధాంభోధిరాకాసుధా
ధాముం డుగ్రవిరోధిసంతమసమార్తాండుండు వీరేశలిం
గామాత్యుండు బిలేశయేశసమవాగ్వ్యాపారుఁ డిద్ధారుణిన్. 84
సీ. కౌండసంభవదండిఖండనాఖండల తుండిపాండురమెల్ల బెండొనర్చి
సారనీరదవారిసౌరుమీఱఁగఁ దేరి రాజరాజఖ్యాతి మ్రందఁజూచి
కంతుజయంతవసంతనలావనీ కాంత తేజము లిసుమంత సేసి
గంగాతనూజవిహంగతురంగస భాంగారజప్రౌఢి భంగపఱచి
తే. యేపుగను కీర్తి వితరణ రూప శౌర్య
ములు ప్రసిద్ధి వహించె భూతలమునందు
బసవమంత్రీంద్రవియ్యమాంబాసుతుండు
సంగతావారి వీరేశలింగసూరి. 85

తే. అతఁడు భాషాజబుద్ధిరాజాఖ్యరాజు
కన్య గుణధన్య లోకైకమాన్య యైన
వీరలక్ష్మిని బెండ్లియై విశదకీర్తి
నలరు శ్రీమల్లికార్జునాదులను గనియె. 86
క. స్మరసుందరుఁ డీవీరే,శ్వరసచివుని పెద్దతండ్రి సత్యవచోభా
సురమూర్తిరాజు సుగుణా,కర యగు శ్రీవేరమాంబికామణివలనన్.
క. చతురంభోనిధి వనజజ,చతురాస్యము లనఁగ జగతి సతతగభీరాం
చితభాషోన్నతి నొప్పెడు,సుతులఁ గని యెనలుపురను విశుద్ధచరితులన్.

క. అంబరగ్రసంపసుండు పు, రంబాసమువైభవుండు రాజకలాపా
మంబకృపాకరుఁ డీభువి, యందుఁబ్రబలెమల్లికార్జునామాత్యుఁడనన్.

క. రెండవతనయుఁడుశాత్రవ,ఖండనుఁ డవనీశకార్యఘటనాఢ్యుఁడుభూ
మండలమునఁ గీర్తి దిశల్,నిండించిన కాళహస్తిలింగము వెలయున్.

తే. అయ్యమాత్యుఁడు ముడిగొండ యయ్యనార్య
పుత్రియైనట్టి సుందరీపూర్ణచంద్ర
వదన సద్గుణసదన నుద్వాహమయ్యె
సకలబంధుజనంబులు సమ్మతింప. [నుండు

తే. మూఁడవసుతుండుమల్లయ మనురవిరోధి, బాణసుతసమశౌర్యసంపద్ఘ
బహుళయాచకసురలోకపాదపంబు,ధారుణీస్థలినొప్పెనుదారమహి

తే. అతని యనుజన్ముఁ డమృతలింగాహ్వయుండు [మ.
హరపదధ్యాని బంధులోకాభిమాని
యబ్జసమధాని సకలవిద్యానిధాని
సతతసన్నుతభూజాని జగతి వెలయు. 93

సీ. అతులితరాజకళాభియుక్తుం డౌట సునవిబుధాధారగరిమ గనుట
ద్విజసనాభిప్రాయవిముఖత నొందుట సహజలక్ష్మీవిలాసంబు గనుట
సమధికద్విజరాజసమ్మదాకరుఁ డౌట వర్ధితస్వచ్ఛభావంబు గనుట
బటుచిత్రభానుప్రభాసంగతుం డౌట నాశ్రితజనాధార మగుట

తే. నమృత మనుపేరు దూషిగా నతిశయిల్లి
వన్నెగాంచె వసుంధరాతలమునందుఁ
గందుమూరి కులాంబుధి కైరవాప్తుఁ
చరితమోహాళి యమృతలింగార్యమౌళి. 94

సీ. శివభక్తిచేఁగ్రేణిసేయుటింతియెకాదు చెందుధర్మస్ఫూర్తిఁ వృషభమూర్తి
దానగుణంబున తగ్గోనర్చుటె కాదు ధనసమృద్ధినిరసించు ధనదునించు
విక్రమాధికతను కీర్తిసేయుటె కాదు వాక్ప్రౌఢిఁ గేరు బాహ్వతికుమారు
వైభవాదూధి చేయించుటయె కాదు పృథుభోగములనొప్పు నింద్రు

తే. సుందరాకృతి నపహసించుటయె కాదు [వెంపు
సరసతరనీతి చెన్ను నైషధుని చెన్ను

భళిర! యితఁ డని కవివరుల్ ప్రస్తుతింప
నలరె రిపుజేత యమృతలింగార్యనేత. 95

ఆ. శుక్రకాంతిఁ జుల్కఁ జూచి చంద్రప్రభఁ
గేరి యక్కడీప్తిఁ గ్రేణి సేసి
కొమరు మించి లేఁ గందుకుఁ దె యమృతాఖ్యుకీ
ర్తిప్రతాపచయము దిశలయందు. 96

చ. ఎనిమిదిజాము లేవరుస నీశ్వరుఁ బూన్చు సహస్రబాహువుల్
తనకుఁ గలంగి చాల వటు తన్మహిమం బది యెంత యంచు బా
ణుని నగి శర్వుఁ బూన్చెఁ బదినూఱునూఱులు నైదుజాలయ
న్ననినమృతాఖ్య సించుక మనంబునఁ గొంకక యొక్కకేలునన్. 97

సీ. యేఁటేఁట శివరాత్రి నీశ్వరప్రీతిగా దీపాయుతంబులె త్తెడిగుణంబు
కాలమ్ములం దప్పక త్రిసంధ్యలందు సమాధిశుఁ బూజించునట్టి నెళవు
శతసహస్రాయుతసంఖ్యలు శివభక్తసంతర్పణంబులు సలుపుమహిమ
సమశీలతీర్థప్రసాదపానంబులు నిరతంబు గొనియెడి నియమవృత్తి

తే. వనిత మాపథ సేవ సేయనివ్రతంబు
ననుదినము లింగముఁ కు రుద్రాభిషేచ
నంబు గావించునిష్ఠ జనంబు లెన్న
ఘనతఁ జెన్నొందె నమృతలింగప్రభుండు. 98

సీ. సద్వంశుఁ డోదితపుణ్యస్థలాచారమార్గప్రతిష్ఠాపనప్రాజ్ఞుఁ డితఁడె
యనుపమవేదవేదాంతశాస్త్రపురాణసంగీతముఖకళాశాలి యితఁడె
వననిధిగాంపశేవధిశివాగారారామసంతానకరణపరిశస్తుఁ డితఁడె
సర్వంసహానాకసర్వకార్యక్రియానిపుణనానాప్రవీణుఁ డితఁడె

తే. తీర్థయాత్రపరాయణాతిథిసమర్చ
నాన్నపానీయదానగుణాఢ్యుఁ డితఁడె
యనుచు సకలజనంబులు సన్నుతి సేయ
నవని వర్ధిల్లె నమృతలింగాహ్వయుండు. 99

తే. బంధుపోషణుఁ డాతండు భాస్కరాజ
వేంకటేశ్వర వెంకమాంబికల నద్ధ

వించి జననుతిఁ గాంచిన వెంకమాంబి
కాహరిణనేత్రఁ బ్రేమ నుద్వాహమయ్యె. 100

సీ. విమలపతివ్రతత్వమునఁబోలఁగ లేకసగమయ్యెఁబ్రాలేయశైలతనయ
వినుతక్షమాగుణంబున సాటిరాలేక నడుగంటి దానయ్యె నబ్ధిరశన
సరసవాఙ్మాధురీసమము గా నేరక వెల్లఁదనము నొందె విధిలతాంగి
శ్రితభాగ్యదానప్రసిద్ధికి సరిరాక చంచలమతి యయ్యె జలధికన్య

తే. ఖ్యాతిగలయట్టివార లీరీతి గాఁగఁ
బుడమిఁ దక్కిన సాధ్వు లీపోలఁతి కెనయె?
యనఁగ నుతి కెక్కె నమృతలింగార్యభార్య
శంకరపదాబ్జరోలంబ వెంకమాంబ. 101

క. బొంకుకలనైనఁ బలుకద, హుంకారం బెప్పుడెఱుఁగ దతిథులఁ బ్రోచుణ్
శంకరుగ నెంచు శరణుల, వెంకాంబకు సాటియైన వెలఁదులు గలరే?

తే. అమ్మహాసాధ్వియం దమృతాభిధానుఁ
డతులసౌందర్యయుతుల జ్ఞానాభిరతుల
వితతశుభకరమతుల సద్వ్రతతిహితులఁ
గాశిహస్తిలింగాదులఁ గని యెఁ బ్రీతి. 103

ఆ. మఱియు నయ్యమాత్యమణికొమ్మ గాజయ్య
పాప్యనకును లక్ష్మి యాత్మజాత
యైనపియ్యమాంబ నతివేడ్క నరయించి
నఖిలబంధుసమ్మదావహముగ. [దుపజూసి

సీ. గోపాలబాలయై గోత్రమెత్తుచుఁ బాల్చెఁ జెందులోపానుద్రఁ బ్రిం
తివవిముఖునకు సంభవమందన కోడఁ గూడినరోహిణిఁ గొనగఁ జేసి
భంగిసంగతునకుఁ బట్టియై పుణ్యజనాళిఁ బొందినలక్ష్మి నపహసించి
చట్టుపట్టుప యయు స్థాణుసిసంచిన కాత్యాయనీదేవి గాకొనర్చి

తే. బ్రహ్మతేజంబు శోభము నభంగ మార్ద్ర
హృదయపద్మంబు గలవాని సుదయ మంది
శంకరయావత్కార్యసంధాన సాస
గుణముబని నొంద బియ్యమ్మ గోక్షాత్రోక్ష, 105

ఆ. బంధుపోషణంబు పతిభక్తి శాంతంబు
సుకృతవర్తనంబు సూనృతంబు
తనకు సహజములుగ ధారుణి వర్ధిల్లె
వినుతగుణకదంబ విద్యమాగంబ. 106

క. ఆసాధ్వియందు వినుతప, యాసాగరుఁ డమృతలింగనూకృతివిజిత
శ్రీసుతుల నీశపదపూ,జాసక్తుల మల్లికార్జునాదులఁ గనియెన్. 107

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశగుణధరున, కాతతకవిబంధుసముపయాంధారునకుఁ
నేతమణిజాతఫణిరు, ట్ఛ్రితఘృణితత్యాగకీర్తిశృంగారునకున్. 108

క. అరిభయదామర్షునకుఁ, ధరణీసురవినుతవాక్సుధావర్షునకుఁ
శరణాగతశరణాంచిత, చరణానతకీర్షునకు సుజనహర్షునకున్. 109

క. భూాలలనాపాలసభా, జానుతాగణ్యపుణ్యసంసక్తునకుఁ
శైలాధిపబాలానుప, మాబ్జపపరాంతరంగహారభక్తునకున్. 110

క. హృతరిపుధరణీపతికిఁ, సతతావితదీనమర్త్యసంతతికిఁ జతు
శ్శ్రుతిభూషణగతిదూషణ,మతిశోషణధృతికిదానమహిమోన్నతికిన్.

క. భూవిదితాత్మీయయశో, జైవాత్మకముకుళితాబ్జషట్కములునకుఁ
శైవాగమభావాగమ, ధీవాగములునకు సాహితీకుశలునకున్. 112

క. శ్రీకందుకూరికులర,త్నాకరశశిమూర్తి రాజహర్షగసేరాం
బాకమలాంకుభవునకుం, బ్రాకటగుణ్యామృతలింగపరసచివునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన చెన్నబసవ
పురాణం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 114



# ప్రథమాశ్వాసము.



## కథాప్రారంభము.



మచ్ఛైలసుతాధినాథపదరాజీవాళిసద్ధుణ్యా లో, పాము
ద్రాహ్యాదయానుకూల్యయుత భాస్వత్కేళియాదిత్య భూ
స్వామి బ్రహ్మముఖామరాభినుత సిద్ధాశాలి పాపాటవీ
స్తోమానర్గళకీలి యైనఘటజాతుం డొక్కనాఁ డిమ్ములన్. 1

సీ. అతులితవేదవేదాంతచర్చలఁ బ్రహ్మనైనఁ గోడిగమూఁడుహంసతతులు
వాదించి పాంచరాత్రాదికంబుల దినకరునైనఁ దెగడుశుకప్రతాన
మాగమమంత్రరహస్యార్థములఁ జంద్రధారినైనహసించుశారికాళి
మహితపురాణవిమర్శ సాత్యవతేయునైన నెంచెడిభుజంగాళినికర
తే. మలరఁ జెలువందుచుండు నిజాశ్రమమున
శిష్యసంఘంబు సేవింపఁ జెలువుతోడఁ
గూర్మికుశపీఠమున నిష్ఠగోష్ఠిఁ బ్రొద్దు
గడుపుచున్నెడ నాకస్మికంబు గాఁగ. 2

శా. శ్రీరుద్రాపరమూర్తి మౌనిముఖరాజీవార్యమస్ఫూర్తి స
ద్వారోదారమనోనువర్తి హృతభక్తవ్రాతజన్మార్తి యో
గారూఢ్యాగతకీర్తి రేణుకగణాధ్యక్షుండు భూలోకసం
చారేచ్ఛం జనుదెంచి యత్తఱి మహాసంతోషసంయుక్తుఁడై. 3

క. తనయాశ్రమంబునకు రాఁ
గని కౌందుకుగ నేగి మ్రొక్కి ఘటజన్ముఁడు దో
డ్కొనివచ్చి యర్ఘ్యపాద్యా
ద్యనుపమపూజన లొనర్చి యతిభక్తిమెయిన్. !

శా. స్వామీ! యెచ్చటనుండి వచ్చితిరో భవ్యంబైన మీరాక మ
ద్ధామం బేము శుభంబు నొందితిమి చింత ల్వీడె సాక్షాచ్ఛివా

రామాధీశ్వరమూర్తిఁ గాంచినటులన్ రంజిల్లె మత్స్వాంత మ
య్యా! మీపాదసమర్చనల్ సలుపుభాగ్యం బబ్బె నేఁ డిచ్చోటన్.

క. అనవుడు దరహసితాననమున నాతం డిట్లు పల్కె మునిపుంగవ నీ
వనఘతపోనిష్ఠ వని ని, న్ననువాంఛ న్వచ్చినాఁడఁ గౌతుక మొదవన్.

వ. అని మఱియును. 7

ఉ. కంతువిరోధియాజ్ఞ ననుకంప దలిర్పఁగ వీరశైవసి
ద్ధాంతము నీకుఁ దెల్పి విదితంబుగఁ దత్క్రియ లెల్ల సర్వరా
ద్ధాంతము నీముఖోదితపథంబునఁ జేయఁగఁ బూని భూమిభృ
త్కాంతతనూభవాధిపునిధామము వెల్వడి సత్వరంబునన్. 8

క. వచ్చియిటనిన్నుఁ గాంచితిఁ, దచ్చరితమువినుమటంచుఁ దప్పకయాతం
డచ్చొత్తినగతిఁ జెప్పిన, సచ్చరితుఁడుకుంభజుండు సంభ్రమపరుఁడై.

చ. అనఘ! దయారతిన్ ఘనరహస్యము దెల్పితి బుద్ధ మయ్యెఁ బా
వనమతి వైతి నిం కొకటి వాంఛిత మెట్లన విన్నవించెదన్
మనసిజవైరి యాజ్ఞ మెయి నాగభుగర్వ్యుఁడు భూస్థలిం గరా
శనమహిమంబుఁ బెంచె నని సంయమిసత్తముఁ డొక్కనాఁ డిలన్.

వ. స్కాందపురాణంబునకు నాయకరత్నంబైన శంకరసంహితయందలి శివరహస్యఖండంబునందు వక్కాణింప వింటి నక్కుమారుం డెవ్విధంబున మహీతలంబు పావనంబుగా భక్తివర్ధనం బొనరించెఁ దద్వృత్తాంతం బంతయుం దెలిపి కృతార్థుం జేయవలయు ననిన నప్పారిషదగ్రామణి యత్యంతసంతోషితస్వాంతుం డై యొక్కింత సెప్పునకుఁ బూర్వంబున శర్వుం డార్యాసమేతుం డై పేరోలగం బున్న సమయంబునఁ దద్దర్శనకుతూహలంబునం జనుదెంచి విరించి క్రమ్మఱి పోవుచుఁ దన్నుఁ బ్రణవార్థం బడిగిన కుమారునితోడఁ దత్ప్రణవార్థంబు లేన యని యథార్థంబుగా నెదు రెఱుంగక పలికి యతనిచేతఁ గారాగృహబద్ధుం డగుట సురలవలనఁ బరమేశ్వరుండు విని యతని విడిపించి తదోంకారార్థంబు సవిస్తరంబుగాఁ దేటపడం బలికిన నిజతనయుప్రజ్ఞావిశేషంబునకుఁ బరితోషంబు నొంది మేదినీతలంబున మన్మహిమంబు ప్రకటింపు మని యనుచుటయుఁ దదనంతరవృత్తాంతంబును దత్క్షణంబ హృదయగోచరంబగుటయు నాకంద

బాష్పధారాపరిషిక్తాంగుండును గంచుకీభూతరోమాంచుండును
గద్గదకంఠుండు నై యతనితో ని ట్లనియె. 11

మ. అనఘా! నీవు వినంగఁ గోరిన మహాఖ్యాన మత్యంతపా
వన మంహోదళనం బహీనఫలదప్రాగల్భ్య మార్యైకభ
క్తనికాయప్రముదాస్పదం బతులమోక్షప్రాప్తిసంసూచకం
బసిమేషప్రకరాభిగణ్య మయి పెంపొ ధారుణీమండలిన్. 12

తే. కుంభసంభవ నీవు వేకోర్కి దీప
వినుము శర్వునికరుణ నేఁ గనినభంగిఁ
దెలుపుదు నటంచు రేణుక దేశికుండు
చెన్నబసవేశుచరితంబు చెప్పఁదొడఁగె. 13

సీ. శ్రీకరాంబరచుంబిశిఖరాభిరామంబు బహురత్నసానువిభ్రాజితంబు
శరభమృగేంద్రాదిసత్వసంకీర్ణంబు దేవవృక్షోద్యానదీపితంబు
కనకాంబుజోజ్జ్వలకాసారకలితంబు బహుళశుకీచయభ్రాజితంబు
కిన్నరబృందసంగీతనాదయుతంబు పటుతాపసావాసభాసితంబు [బు

తే. దళితపాపంబుముక్తిప్రదాయకంబు, ప్రమథనిలయజ్ఞసర్వజ్ఞపాలితం
వేదవేద్యంబు తారకవిలసితంబు,భవ్యవిభవంబు కైలాసపర్వతంబు.

ఉ. ఆయతతద్ధరాధరశిఖాగ్రసమంచితపీఠదేవతా
నాయకరత్నకాంచనఘనద్యుతిసంచయ మెల్ల నేకమై
తోయదమార్గదేశమునఁ దోరముగాఁ గనుపట్టు టొప్పె గం
గాయమునాసరస్వతు లుపకంఠ నభిన్నతఁ జేరుకైవడిన్. 15

సీ. పున్నాగవిస్ఫూర్తిఁ బొల్చు టంతియె కాదు
పున్నాగవిస్ఫూర్తిఁ బొల్చు మీఱెఁ
జనుదెంకోకర్ణమై చెన్నొందుటయె కాదు
చమరికాంచత్ప్రభ బ్బొలు మిగిలెఁ
గుంజరాశనదీప్తి గొరలు టంతియె కాదు
కుంజరాశనదీప్తి గొమరు మిగిలెఁ
బ్రియకబృందంబున బెంపొందుటయె కాదు
ప్రియకబృందంబునఁ బేర్మిఁ గనియె

తే. నవనగ వృక్షమ్ముగాకీర్ణ మగుచు సకల
భువనసన్నుతిఁ గాంచె నద్భుతము గాఁగ
శతసహస్రసుధాభానుసన్నిభప్ర
కాశమహిమాస్పదంబు తత్క్ష్మాధరంబు. 16

వ. మఱియు నద్ధరాధరరాజంబు విరాజమానం బై స్వర్గలోకంబునుం బోలె రంభాదేవవల్లభసురుచిరవిలాసం బై యర్చిష్మతీపురంబునుం బోలె నిరుపమశుచిప్రదేశం బై సంయమనీనగరంబునుం బోలె విలసితధర్మావాసం బై నిర్ఋతిభువనంబునుం బోలె సంతతపుణ్యజనస్థానం బై వరుణపట్టణంబునుం బోలె భాసురభువనోన్నతం బై గంధవతీపుటభేదనంబునుం బోలె శంకరప్రవాహావిలసితం బై యలకాపురంబునుం బోలె శంఖమకరపద్మాకరం బై యీశానలోకంబునుం బోలె నీలకంఠసంచారం బై పాతాళంబునుం బోలె నాగలోకకలితం బై యొప్పుపర్వతశిఖాగ్రంబున. 17

చ. పగడపుఁగంబముల్ తళుకుబంగరుబోదెలు తమ్మికెంపురా
నిగనిగ లీనువాకిలులు నిద్దపువెన్నెలఁ జేనిరాలఁ జె
న్నగు జిగిగోడలుం బొగసులై తగుపచ్చలతోరణంబులుం
బొగఁ జెలువొందు నొక్కమణిధామము శర్వనివాసయోగ్యమై 18

క. ఆమహాసీయ సభాభవ
నామలమణ్యప్రదీపితార్క్యయుత శ్రీ
హేమమయాసనరత్నాంచిత
19 హైమగుభాసనమునందు నతిముదమొప్పన్.

[లువ
సీ. కమలభవాండముల్ కందుకంబులరీతిఁ బట్టి యాడెడుగణప్రభులుగొ
సహజైకలింగనిష్ఠావ్రతస్ఫూర్తిచేఁ జరియించు భృంగిలాస్యం బొనర్ప
నాఁటని వృషభేశ్వరాకారం బయి తగుఁ నందిసందడి తలఁగఁజడియ
తే. నతులితాష్టాంగయోగానందపరవశులైనమౌనీశ్వరు లభినుతింప
నమరగజగామినులు చామరములు వీవ
గరుడగంధర్వముఖ్యు లిరుగడల నిలువ
శైలతనుజాతయును దాను జంద్రమౌళి
నింపుకొలువుండెఁ గన్నులపండువుగను. 20

ర్గము భర్గుం గొనియాడఁగా నిటకు వేడ్కన్ వచ్చితి న్నాపుడున్
మిము నిం కొక్కటి వేడె నే నడిగెదన్ నిక్కంబుగాఁ జెల్పుమా.

క. ఏమేమి చదువుకొంటివి, తామరసభవా! యటన్నఁ దనమది వాణీ
కాముని ననుఁ జదువడుగఁగ, నే మిటికని తలఁచినగుచు నిట్లనిపలికెన్.

క. వేదములు నాముఖంబునఁ, బాదుకొన స్వాధ్యాయుఁడుగఁ బనియున్నదియే
నేఁ దెలియని యది యెయ్యది, లేదు తలఁప నాకుసాటి లేరు జగములన్.

వ. అనిన దరహసితాననుం డై కుమారుండు. 31

తే. సకలవిద్యలలోపల సారమైన, విద్య యొక్కటి వినుటకు వేడ్క యయ్యెఁ
గాన నను జిన్నవాఁడని గడుపకిపుడు, పన్యసింపుమటన్న నప్పద్మభవుఁడు.

క. వేదముల కాదియగు నా, గ్వేదముఁ బఠియింపు మొదల విస్పష్టముగా
నాదానుస్వారసువర్ణోదారం బైన ప్రణవ మొప్పఁ బలుకనన్. 33

చ. విని తలయూఁచి చాలు నరవిందజ! యీ ప్రణవార్థ మెట్టిదో
కనియక తెల్పి నాహృదయకీలితసంశయ మెల్లఁ బాపుమా
యనిన నజుండు లేఁతనగ వాననసీమఁ దలిర్ప నంబికా
తనయునితోడ గర్వ మెదఁ దార్కొన నిట్లని పల్కె నత్తఱిన్. 34

ఆ. మాటలేల ప్రణవమంత్రంబు నేనతె, యర్థ మేన యనిన నగ్నిభవుఁడు
గనులఁ గెంపుగదురఁగ నడచవేటికొ, పూర్వకముగ నతనిగర్వ మణఁచి.

సీ. అంతటఁ గినుక చల్లారక కా[illegible]
సాధ్యక్షుఁ డతిరోషితాత్ముఁ డైన
శిఖివాహుని బిల్చి విమలప్రణవమంత్ర
మంత్రార్థములు చంద్రమౌళి యుగ [illegible]
మెఱిఁగి యుండియు జ్ఞానహీనుఁడై నే నని
పలికెఁ గాన నిని బట్టి కట్టి
స్కందశైలంబున బంధి నుంచుమనుచు
నాఁతఁడు పరమేష్ఠి నట్ల [illegible]

ఆ. లోకసృష్టి పెరప లోపంబు [illegible]
స్కందుఁ డెప్పటట్ల జరుపుచుండె
నంత సురలు మునులు నంబుజాసను [illegible]
చింత నొంది సాంబశివు గుఱించి. 36

చ. ఘనతర మైననిష్ఠఁ జిరకాలతపం బొనరించి పార్వతీ
వనజముఖీసమేతుఁడయి వత్సలతం బొడసూపినట్టి భ
ర్గుని విమలాంఘ్రియుగ్మమునకుం బ్రణమిల్లి యనేకభంగులన్
వినుతి యొనర్చి వాంఛితము వేఁడుఁ డటన్న మహేశుతోడుతన్.

క. శరజన్మునికోపంబున
సరసీజాసనున కైన సంకట మెల్లం
గరుణ జనింపఁగఁ బలికి ఖ
చరమునిసంఘంబు మఱియు సవినయ మొప్పన్. 38

దేవాదిదేవ! విను మీ
సేవకుఁ డగుబ్రహ్మకైనచిక్కెడలుటయే
మావాంఛిత మని పలికిన
భావజసంహారుఁడు మిగులఁ బ్రముదితుఁ డగుచున్. 39

క. పరమేష్ఠి న్విడిపించెద, నరుగుఁడు మీమందిరంబులకు వడి నందీ
శ్వరుఁ గనుఁగొని నీవిప్పుడు, సరగున మత్సుతునికడకుఁ జని యాతనితోన్.

శా. స్వాతంత్ర్యంబు వహించి గర్వ మెసఁ బర్వం బల్కు నీరేజసం
జాతుం బందిని బెట్టె శీతలనుభృజ్జాసూనుఁ డంచుం సురల్
నాతోఁ గూయిడి రట్లు గావున దయాలంబుండవై యాతనిం
బీతాజ్ఞాలయుఁ జేసి పుచ్చు మిపుడే విశ్వంబు నిర్మింపఁగన్. 41

మ. అని నావాక్యము గాఁగఁ బల్కు విగతాహంకారుఁ గావించి జీ
వనజాతోద్భవుఁ డాఁక వీడి సుఖియై వార్తల్వాడిం దెమ్ము పొ
మ్మని పంపం జని నందికేశ్వరుఁడు స్కందాద్రిం సఖుల్ దాను దా
రొక్కని క్రీడించుచునున్న షణ్ముఖు హతాఘుం గాంచి మోదంబునన్.

క. నిటలతటఘటితకరసం, పుటుఁడై యిటు పల్కెనతఁడు స్ఫుటవాక్యములం
జటివినతుఁడైన దిక్పటుఁ, డిట కనిచిన వచ్చినాఁడ నినసంఖ్యాత్మా.

క. వనజాసను చెఱ మాన్పు
మని యనిమిషమునులు వేఁడ నన్నాత్ముఁడు దా
విని యిటు లొనరింపుదుఁ గా
కని మెంగాఫ్రునఁ బదాజ్ఞ యొకాల నిడుమా. 44

చ. అన విని యీశ్వరాజ్ఞ దలయంప ధరించితిఁ గాసి దుర్మదం

బునఁ దను దా నెఱుంగక ప్రపూర్ణమహత్త్వ మనుస్వరూప మే
నని వచియించినట్టి నలినాసను ముక్కు చెఱఁ బెట్టి యూరకే
చను మని యిత్తఱి న్విడచి చక్కఁగఁ బంపఁగ నంత వేడ్కినే. 45
తే. నలినసంభవు విడు మంచు నంది కేశ
నీవు వచ్చితి గావున నే సహించ
నయ్య నీక నొండుపలుకకు మరుగు మనిన
నాతఁ డరుదెంచి శివుని కారీతి దెలుప. 46
చ. వినిచ పరహాసవక్త్రుఁడయి విశ్వగురుండు గిరీంద్రనందనం
గనుఁగొని వింటి నీతనయుఁ గొళకు మచ్చుట కింక వేగ నేఁ
జనక విధాతృమోక్షణము సల్పుఁడు వాఁ డని తెల్పి యప్పుఁడో
య్యనఁ గడుప్రేమ మీఱ సతి నంతిపురంబున కన్చి చెచ్చెరన్. 47
క. పారిషదామరముని పరి, వారుండును దివ్యవృషభవాహుం డై నీ
హారకిరణార్ధధారి కుమారగిరీంద్రమున కరిగె మదిముద మొదవన్.
చ. అటు చని కాంచె శంకరుఁ డహార్యసుతాపరపుత్త్రిసన్మణీ
కటకకిరీటకుండలవికాసితశోభనగాత్రు సృష్టిసం
ఘటనవిలాససమ్ముదితకాంచనశైలనివాసగోత్రువి
స్ఫుటనుతిపాత్రు దీప్తిపరిభూతసహస్రపయోజమిత్రునిన్. 49
మ. కని డాయం జనునంతలోపలన తత్కాంచోర్వీభృద్భేది ది
గ్గన సర్గం బటు నిల్పి లేచి వృషరాట్కాండావతీర్ణుండు సం
జనితామోదియు నైన తండ్రికి నమస్కారంబు గావించి ని
ల్చిన పట్టిం గని కౌఁగిలించి యెదలోఁ జెన్నొందుమోదంబునన్. 50
తే. అంత గిరిధన్వి పరిచారికాళి సత్వ
రముగ నుంచిన సింహాసనమునఁ గూరు
చుండి సుతు నంకతలమున నుంచుకొని శి
రంబు మూర్కొని బుజ్జిమొగంబు దువ్వి. 51
మ తనయా యాటలు మాని వేడ్క పనిమీఁద న్నిల్చుచందంబు దోఁ
చె న దేకార్యము? దెల్పుమా! యనిన నే సృష్టిక్రియారాధవ
ర్తనచే నుంటి నటన్నఁ బద్మజునిఁ గాదా మున్ను తత్సృష్టి నే
య నియోగించినవార మిప్పు డిటు సేయం గారణం బేమొకో! 52

వ. అనిన నతం డి ట్లనియె. 53

క. తను నెదిరి నెఱుఁగ కాడిన, వనజాసనుఁ బట్టి బంధివైచితి నన నా
తనిమాటలేమొ పిదప, స్వామి యెదఁగా కిపుడు వాని విడువుము పుత్రా!

చ. అనవుడు నేమియుం బలుక కాతఁడు మోము వంచియున్నఁ గ
న్గొని శివుఁ డబ్జజన్ముపయి నూల్కొనుకోపము నాదువాక్యముల్
మనమున లగ్నమౌకతన మా ఱనఁ జాలక మిన్నకుండె నీ
తని నడలించి చెప్పక విధాతఁ జెఱ న్విడఁడంచు నత్తఱిన్. 55

ఉ. నేరుపునేరముల్ పిదప నిర్ణయమయ్యెడుఁ గాని యిప్పు డా
నీరజసంభవున్ విడుము నీమదిఁ గోపము గూడ దంచు నే
గౌరవ మొప్ప జెప్ప వినఁ గానవు తండ్రి యనుజ్ఞ మీఱి సం
చార మొనర్పు కుచ్చితుల సాటికి రా మది నెంచినాఁడవో? 56

తే. అనిన గిరిజేశు భావంబుఁ గనుల కెంపు
బొమముడియుఁ గాంచి పార్వతీపుత్రుఁ డాత్మ
జంకి వినయంబుతో లేచి చాఁగి మ్రొక్కి
వీరబాహుని గను నంత వేగ యతఁడు. 57

క. జంభారిముఖులు చూడఁగ, నంభోరుహభవునిఁ దెచ్చి హరుమ్రోల నిడం
గుంభినిజాఁగిలఁబడి వా, గ్జృంభణ మొప్పంగ నతఁడు గీల్కొను భక్తిన్.

దకారగుణితము.—

చ. దరసమ దేవదానవవిదారణ దిక్పట దీనపోషకా
దురితతమస్సహస్రకర దూషకసంహర దేవదేవ దై
న్యరహిత దోర్బలాంతకవినాశన దైత్యభృదాది దేయ దం
భరసవిశోషణ ప్రథితపావక దర్పకదర్పభంజనా. 59

చ. అని వినుతించు నాతని ప్రియంబునఁ గన్గొని శూలపాణి యి
ట్లను శిఖిసాది నీ వనుచు నాటతమిం దెలియంగలేక వం
చన మొనరించె నందుకు విచారముఁ జెందకు మెప్పటట్టులన్
జని సుఖవృత్తి నొందు మని సారసగర్భుని వీడుకొల్పినన్. 60

క. మదిముదమందుచు నాతఁడు, మదనారికిఁ దత్కుమారమణికిఁ బ్రణతుఁడై
కదలిచని తొంటిగతి నిజ, సదనంబున భువనసృష్టి జరుపుచునుండెన్.

క. తదనంతరమున నిచ్చటఁ
బోదలేదు మోహమున మగుడఁ బుత్త్రుని దనపై
రెదఁ జేర్చి యంకతలమునఁ
గదియించి లతాంతకాండఘస్మరుఁ డనియెన్. 62

శా. ఏరా చిన్నకుమార నీరజభవుం డేనేరముల్ సేసెరా?
సారోదారుఁడు వజ్రిముఖ్యసుమనస్సంసేవ్యుఁ డౌ నాతనిం
ఘోరంబౌ చెఱ నుంచ నీకుఁ దగునా? కోపించి నీ వట్లన౯
ధీరత్వంబున బాహులేయుఁడును దండ్రిం గాంచి కేల్మోడ్చుచున్.

సీ. అన్న విధాత మి మ్మర్చింప వచ్చెడువేళఁ గ్రమ్మఱిపోవు వేళనైన
నన్ను లక్ష్యము సేయ కున్న నాతనిఁ బిల్చి యెవ్వఁడ? వీవిట కేలవచ్చి?
తనఁ దన పేరును దలమునుద్యోగంబు ఘనతయువచ్చినపనియువిద్యఁ
బెంపునఁ జెప్పినపిదప నే బ్రణవార్థ మెఱుఁగ వేఁడఁగ నాతఁ డెదురుదన్ను

తే. నరయక యపార్థముగఁ బ్రణవాఖ్యమంత్ర
మును దపర్థంబు నే నని పెనుమదంబు
తొలుకఁ బలికిన తులపయా నలువ బంది
నిడితి నదలితి మీ కిష్టు విడువు మనిన. 64

చ. అనవుడు పిన్ననవ్వు నగి యబ్జధరుండు కుమార ధాత వం
చన మొనరించినాఁడ వది సమ్మతమే? యిఁక నీవు చెప్పుమా
యసితరసాధ్యమైన ప్రణవార్థము తేట పడంగ నావుడు౯
జనకునితోడ ని ట్లనియె శైలసుతాతనయుండు నమ్రుఁడై. 65

క. సర్వజ్ఞుల రగుమీకు౯, సర్వేశ్వర యొకటిఁ దెలుపఁ జాలుదునే? త
ద్గుర్వధిపకథితమంత్రం, బుర్విని శిష్యుండు దెలుప నోపునె యెందున్.

తే. అయిన నాయందుఁ గలుగుదయాసమృద్ధి
కతన మన్ముఖమున వినఁ గాంక్ష చేసి
నారు గావున మీపాదనలినబలము
చేత విన్నప మొనరింతుఁ జిత్తగింపు. 67

ఉ. నావుడు శంకరుండు నిజనందను వాక్యము లాలకించి తా
భావమునందు సంతసము పర్వ రహస్యముగాఁగ విందు సౌ
ఖ్యావహమంత్రరాజ మని యాతనికై చెవి యొగ్గి సంశయా

భావముగాఁగఁ జెప్పెఁ బ్రణవప్రకటార్థ మతండు ధీరుఁడై. 68

ఉ. ఆగతిఁ జెప్పిన న్మనురహస్యము వీనులవిందు గాఁగ వి
వ్యాగశరాసనుండు విని యద్భుతమోహదయానుమోదసం
యోగమనస్కుఁడై నిజసుతోత్తము నెంతయు గారవించి యా
గుణధుర్య చెప్పితి పరాత్పరమంత్రము తేటతెల్లఁగన్. 69

ఉ. నీకును మాకు భేదము గణింపఁగ లే దణుమాత్రమైన భూ
లోకమునందు భక్తి కడు లోపముఁ జెందిన దట్లు గాన మ
ర్త్యాకృతిఁ బుట్టి నా వగు మహత్త్వము బోధ మొనర్చి మానవా
నీకములన్ భవాబ్ధిదరిఁ జేర్పుము నీ దగు నే ర్పెలర్పఁగన్. 70

తే. ఏతదర్థంబు మును నందికేశ్వరుని ధరాతలంబున కనిచితి నాతనికిస
హోదరీరత్నమై భక్తినొప్పునాగమాంబికాదేవితనయుఁడవై జనించి.

చ. అసదృశనందికేశ్వరుని యంశమునం జనియించి మించు త
ద్బసవనితోడ సంతతశుభప్రద భక్తి శుభానుభూతిఁ బెం
పెసఁగుచు మర్త్యమానశరణేశ్వరపద్మజనం బొనర్చుచున్
వసుమతిఁ గొన్ని వర్షములు వర్తిలు మత్సమదాజ్ఞ వెంబడిన్. 72

వ. అని యిట్లానతిచ్చిన జనకునివాక్యములు విని కుమారుం డపసీత
లోద్భవంబున కసమ్మతంబును జనకాజ్ఞోల్లంఘనానర్హవిచారంబును
మనంబునం బెనఁగొనుటయు నేమియుం బలుకక యశ్రుపదనుండై
యూరకున్న నతనిభావంబు శంకరుండు దివ్యచిత్తంబున నెఱింగి ధరా
తలంబున భక్తివర్ధనంబొనరింపవలయు ననుతలంపు ప్రేరేప వీఁడంబి
కాసంబోధనంగాని చక్కంబడఁడని యూహించి పార్వతిందలంచిన
సమస్తజగద్వృత్తాంతవేదినియగు తత్సతీపతంసం బనర్ఘ్యమణిభూష
ణాలంకృతయు నిరుపమవాసనాసమాగతచంచరీకనాదమేదురాద్రి
తేయమేదినీజలతాంతదామాభిరామయు మందస్మితసుందరవదనా
రవిందయు రాజకీరలీలాసరోజాతహస్తయు దేదీప్యమానకాంచనాం
బరసహితయునై యనేకనాకలోకైకకోకిస్తనీలోకంబుల ధరసమా
నమణిమయంబు లగునాలవట్టంబులు గొందఱు వజ్రమయదండచా
మరంబులుం గొంద ఱతులితశాతకుంభశుంభద్దండపుండరీకంబులుం
గొందఱు చిత్రవిచిత్రపట్టాంబరకేతనంబులుం గైకొని యరుదేర

విద్యాధరకిన్నరకింపురుషగంధర్వకామినులు సంగీతసాహిత్యవేణువీణాదివినోదంబుల నింపు సంపాదింప యక్షగరుడోరగసిద్ధసాధ్యమిథ్యామధ్యలు ఖడ్గవేత్రపాదుకాజలకలశవీటికాపేటికాధారిణు లై నడువ దివ్యవిమానం బధిరోహించి స్కందమహీధరంబునకు వచ్చి విభావరీశభూషణసభాసికటప్రదేశంబునఁ దద్వాహనావతరణంబు గావించి తనుంగనుంగొని లేచి నమఃశపూర్వకంబుగా నిటలతటఘటిత కరులగు సురలసిరుపమకరుణాకటాక్షేక్షణంబున వీక్షింపుచుఁ బ్రాణేశ్వరు డాయం జనుదెంచి ప్రణమిల్లి తదనుమతి నర్ధాసనాసీనయై యుండి చింతాననుం డైనసుతుం గని వీఁ డిట్లు చింతాక్రాంతుండై యున్నకతం బేమని పతి నడిగిన నతండు మందస్మితవదనుండై సతితోడ గతవృత్తాంతంబంతయుం దెలిపి యేతదర్థంబుగా నిన్నుఁ దలంచితిం గావున నీతని క్షితితలంబున కరుగునట్లు సమ్మతిపఱుపు మన విని నగతనయ మనంబున నొక్కింత విచారించి తొల్లి భూతలంబున సంభవంబు నొందు నిజవయస్యయగు నాగేంద్రగమనకుఁ గుమారుని: గుమారునిఁగా నిచ్చెద నన్న వచనంబున కనురూపంబుగా నీశ్వరుం డానతిచ్చుట కానందంబు నొంది తనయుం డాయఁ దిగిచి తొడలపై నిడుకొని కూఁకటులు పుణుకుచు నిట్లనియె. 73

సీ. అన్నకుమార! మీయయ్య చెప్పినమాట కీవియ్యకొనఁదగు నిలజనించు
కతన నీకుఁ గొఱంత గలుగదు తనకు నీకొక్కింత వేఱులే కునికి నిన్నుఁ
బంచెదా జనునట్టిపని కది గాక నే మున్నె పంపఁ దలంచి యున్నదానఁ
గావున మాయాజ్ఞ గైకొని భూతలంబున కేగి యచ్చట పొనుగుపడిన

ఆ. భక్తి నుద్ధరించి పరవాదుల నడంచి
యసుము ద్రుంచి దెసల యశము నించి
ప్రౌఢి మించి శర్వభక్తుల రక్షించి
మరలి రమ్ము చింత మాను మనిన. 74

ఆ. సమ్మతించి గుహుఁడు జననీజనకపాద
సరసిజాతములకు సాఁగి మ్రొక్కి
మీయనుజ్ఞ నేను మీఱంగ నేర్తునే?
యట్లు సేయువాఁడ ననుచుఁ బలికె. 75

వ. అట్లు పలికిన కుమారుని వాక్యంబులకుఁ బార్వతీపరమేశ్వరు లానదం
బు నొంది యతనిం గౌఁగిలించుకొని దీవనలొసంగి పొమ్ము వేగమ్మున
మరలి రమ్మని యనేకవిధంబుల గారవించి పారిషదబర్హిర్ముఖ బ్రహ్మ
దేవర్షిపరివారంబులతో నిజనివాసంబున కరిగి యిష్టవినోదంబులం
దేలుచుండి రక్కుమారుం డవనీతలంబునఁ జెన్నబసవేశ్వరుం డన
బసవేశ్వరభాగినేయుం డై జనియించి యసదృశమహిమావిశేషం
బున భక్తివర్ధనం బొనరించెఁ గుంభసంభవా ! తద్విధంబు విస్తరంబు
గా విను మని రేణుకుండు చెప్పం దొడంగె. 76

కళ్యాణపురవర్ణనము.

సీ. శ్రీసమంచితరాజశేఖరాగారంబు వరసర్వమంగళావాసభూమి
ప్రాకటవీరభద్రాకరవిభవంబు పటుదంతిముఖబలభాసురంబు
నతులరంభాదికోద్యానవిలాసంబు రమ్యవిద్యాధరభ్రాజితంబు
నగణితపురుషరత్నావళీకలనంబు ప్రబలగంధర్వవిరాజితంబు
తే. నగుచు మారట కైలాస మనుచు సకల
జనము లద్భుతపూరితస్వాంతు లగుచు
వినుతిఁ గావింపఁ దనరెఁ బృథ్వీతలమున
భాగ్యజనకంబు కళ్యాణపట్టణంబు. 77

మ. జ్వలనాత్యున్నతసౌధసంఘటితభాస్వద్వజ్రనీలోపలో
జ్జ్వలకాంతిప్రకరంబు నల్దెసలఁ బర్వం జౌనలోకంబు ని
చ్చలు శ్వేతాసితపక్షమానిశల లేకం బైన స్వాంతంబునం
దెలియంజాలక సంశయించు పురివర్ణింపఁగ [illegible]. 78
తే. ఆకసం బంటుకొమ్మల నమరు సస్యొ
జాధి[illegible] [illegible] ఇంభాగనినుతి
పాత్రమై ము[illegible] [illegible]ను నే బ[illegible]ల్లి
సా[illegible]ము [illegible]చ్చుఁ బురిఁ గల్పసా[illegible] మనఁగ. 79
తే. [illegible]నముం[illegible] సగ[illegible] క్తి [illegible]గల్లి
పుష్కర[illegible]త్రి [illegible] [illegible]
[illegible] సర్చు మెచ్చ [illegible]
కరినికర [illegible]మొప్ప [illegible]బోలు పురము నందు. 80

చ. జలజసఖాశ్వముల్ గతులు సాటికి రాఁ గని తన్మనోద్ధతిం
దోలఁగఁగఁ జేయ నింగి కయి దూఁగగ నైజఖురోత్థితావనీ
తలరజ మంబరాంబరము దార్కొని క్రమ్మిన దానిచాటునం
బలువిడి భీతిఁ బాఱఁ గని వాని హసించుఁ బురీవరాశ్వముల్. 81

చ. అతులితతత్పురీపథమహాధ్వజసంఘటితాచ్ఛఘంటికా
వితతిజయాభిరావములు విశ్వము నిండినఁ దద్భయార్తి న
చ్యుత జలజాతబాణ పురహాంతరథంబులు గానలందుఁ బ
ర్వతగుహాలం దదీయశిఖరంబులుఁ జేర రయంబు మీఱఁగన్. 82

క. తెలతెలఁబోవుచు దమనీ,డలకులుకుచు బిలములోన డాఁగెడుసింహం
బులు శౌర్యకలనమాసరి, వెలయునె యనినగుదు రచటివీరనృసింహుల్.

ఉ. చేడియవల్ల నించుకఁ బ్రసిద్ధి వహించెను గాని నిల్చి మా
టాడిన నాల్గుదెర్లు ధర నాతనిప్రౌఢిమ లెక్కవెట్టఁగాఁ
గూడునె యంచుఁ బద్మజునిఁ గొద్దిగ నెంచి వసింతు రప్పురిం
బాడబు లుత్తమోర్జితులు భవ్యనిరూఢవచోధురంధరుల్. 84

చ. నిరుపమపద్మినీహితులు నిర్మలమూర్తులు సత్ప్రతాపభా
సురతరమోదదాయకులు సుస్థిరమిత్రసమేతు లప్పురీ
వరనిలయాభిరాములయి వర్ధిలు రాజులు రాజు లెక్కసే
యరు తమవిక్రమస్ఫురణ నాతఁడు వర్తిలలేక యుండుటన్. 85

క. బేహారులు మృదుసత్య,వ్యాహారులు కీర్తివిజితహారశైలసమా
కాహారులు కవిసంతతిమం,దీహారులు గలరు పురి నసంఖ్యవిహారుల్. 86

క. శూద్రులు హలనిర్జితబల,భద్రులు సద్గుణగణాధిభద్రులు సుఖని
ర్నిద్రులు వితతగభీరస,ముద్రులు గల రచట బుధసమూహాసురద్రుల్.

సీ. ఏవీథిఁ జూచిన నిభదానవాంతకసదనసముత్కరసంభ్రమంబు
లేచంక నరసిన నేణాంకకోటీరసాటపంకేజాతభక్తమహిమ
లేచాయ నాలింప హిమగిరిజాధిపలలితకథాసుధాలాపచయము
లేచక్కఁ గనియింప హేమధరాధరబాణానుసేవానుభావనంబు

తే. లెచటఁ దలపోయఁ బద్మినీహితమ్ముగాంక
జాతవేదాంబకాభంగశాస్త్రచర్చ

లప్పురీవరమాహాత్మ్య మభినుతింప
నలవియే శేషఫణికైన నజునికయిన. 88

క. ఆపుటభేదన మేలెడు
భూపాలకుఁ డర్థినికరపోషణుఁడు సమి
ద్వ్యాపారచణుఁడు శుభముల
నేపుఁ దనర్చె బిజ్జలాఖ్యుఁ డిప్పసుమతిలోన్. 89

ఉ. జైనకులప్రవర్ధనుఁడు శాశ్వతకీర్తియుతుండు నిర్మలం
బైనగుణాభిరాముఁడు ధనుర్గుణటాంకరణారిమండలీ
మానససాధ్వసప్రదుఁడు మన్మథమాధవరూపశాలి నా
నానరనాథసన్నుతసనాథుఁడు తత్క్షితినేత వర్ధిలెన్. 90

క. ఆరాజమంత్రివర్యుం, డైరాజిలు సకలదిగధిపాంబుజవదనా
భూరిస్తనహారాయిత, చారుసమాఖ్యుండు బసవసచివుం డెలమిన్.

సీ. యేధన్యుమానసం బిందుశేఖరపాద
తోయసంభూతభృంగాయమాన
మేకృతార్థుకృపావలోకనం బర్థిదై
న్యాశుశుక్షణివార్షికాంబువృష్టి
యేపుణ్యచారిత్రు కోపయుగ్మాభిభంగ
మఖిలాన్యమతజాతసాగరమూఁఢ
మేమంత్రమాహాత్మ్య మింద్రాబ్జభవముఖ
బృందారకానీకవినుతిపాత్ర

తే. మట్టిఁడు గొనియాడఁ దగు నింపెంపుగాచిలేంద్ర
సంభవాపల్లవినియోగసకల మర్త్య
పానార్థమాదాన్యసత్ప్రతిమ మాచ
మాంబికాగర్భజుఁడు బసవయ్యవరుఁడు. 92

సీ. సతతంబుగురులింగచరసమర్చలెకాని యితరార్చనంబుల నేవగించు
జంగమతీర్థప్రసాదసేవయెకాని యితరంబు రుచిగొన నేవగించు
మాహేశ్వరవ్రాతమాహాత్మ్యమేకానియితరంబువినుటకు నేవగించు
సతతగణాధీశసద్విలాసమెకాని యితరంబు నసుగొన నేవగించు

తే. నెంతసజ్జనుఁ డీధన్యుఁ డెంతధీరుఁ
డెంతమహిమాఢ్యుఁ డని జను లెన్నుకొనఁగ
రాజ్యభారంబు శివభక్తి రాజ్యభార
మెలమిఁ బాలించె శ్రీబసవేశ్వరుండు. 93

తే. అనుదినము లక్షతొంబదియాఱువేల
జంగమంబుల కిష్టాన్నసమితి యొసఁగి
మిండజంగమములకుఁ బండ్రెండువేల
కనుచు వేశ్యాగృహంబున కట్టెపగిది. 94

క. అచలితతత్త్వైంకర్య, ప్రచురశ్రవణానుమోదభరసకలదిశా
నిచయసమాగతశరణుల, ఖచరజ్యేష్ఠునకు వశమె గణుతింపంగన్.

సీ. సుజ్ఞానశీలురు సూనృతవాక్యులు త్రిభువనపూజ్యులు ధీరమతులు
వేదాంతవేదులు వీరశైవాచారసంగ్రహకర్తలు శాంతిసహితు
లష్టవిధాంగయోగానందపరవశు లసదృశలింగలీనాత్మవర్గు
లంతకదూరు లత్యంతకరుణాసముద్రులు నిరుపమభద్రగుణులు

తే. సత్ప్రసాదాంగు లకుటిలస్వాంతరంగు
లతులభవదూరు లన్యదుర్మతవిదారు
లచలదాసోహమతులు భక్తాధిపతులు
శర్వపదపద్మభృంగముల్ జంగమములు. 96

క. పరవికచాబ్జేక్షణ సో
దరి ముక్తి సతీలలామ దారకశుకు బం
గరు పెంచు రుణము గరళము
కరుణయ పూన్కిగ నటంచు గణసింహాంబుల్. 97

తే. నిండి కళ్యాణపురము పండ్రెండుయోజ
నముల నెల్లెడ నెడలేక నమితు లగుచుఁ
గాలకంధరుపరభద్రగజము లనఁగ
సతిముదంబున వసియించి రంచితముగ. 98

చ. వినయవివేకభక్తిగుణవిశ్రుతుఁ డాబసవేశ్వరుండు దా
ననయము తద్గణాధిపుల కందఱ కీప్సితవస్తుజాతమిం-

పొనరఁగ నిచ్చుచుఁ బ్రమద మొంది సుధామయతత్ప్రసాదమున్
వననిధిఁ దేలుచున్ మహిమ వర్ధిలఁజేయుచు నున్నయత్తఱిన్. 99

కక్కయ్యగారి కథ.

శా. దృక్కర్ణేశకలాపమూర్తి సురధాత్రీజప్రభాకీర్తియు
గ్దిక్కాలప్రకరుండు కామముఖవిద్విట్సంహరుం డాశ్రిత
ప్రాక్కర్మాంబుధిబాడబానలుఁడు భాస్వత్తేజుఁ డాప్రోలిలోఁ
గక్కాఖ్యుం డొకభక్తసత్తముఁడు శ్లాఘ్యఖ్యాతి వర్తిల్లఁగన్. 100

తే. బసవదండాధినాథుండు భక్తితోడఁ
దద్గణాధిపవరు ప్రసాదంబుఁ గొనఁగఁ
దలఁచి పండ్రెండువత్సరంబులు మహాప్ర
యత్న మొనరించి యంతట నబ్బకున్న.

మ. కమనీయామృతతత్త్వయుక్తుఁ డగునాకక్కయ్యదివ్యప్రసా
దము నేఁ గాంచఁగ నేరనైతి నకటా! తద్భాగ్య మేతీరునన్
సమకూరున్ ననుఁబోలువాని కనుచున్ స్వాంతంబులో నెంచి యు
త్తమమై యొప్పు తదీయమందిరముచెంతం జేరి యచ్చోటునన్.

ఉ. అంగణసీమ నల్గడల నంతట నింతట సిల్చి కాంచుచున్
ముంగల నొక్కచీమ కొనముక్కున నొక్కకణంబు పట్టి యే
గంగని జ్ఞాని గ న నిది కక్కయగారిమహాప్రసాద మె
బ్బంగి ననంశయం బనుచు భావమునందుఁ దలంచి వేడుకన్. 103

చ. భవములఁ బాసితి న్మిగుల భాగ్యముఁ జెందితిఁ గోరుకోర్కె చేఁ
దవిలె సమస్తసద్గుణవితానములోపల వన్నె గాంచితిన్
భువనసుతాభిరామగుణపూజ్యుఁడు కక్కయసత్ప్రసాద మీ
భువిఁ గనుఁగొంటి మంటి నతిపుణ్యచరిత్రుఁడ నైతి రూఢిగన్. 104

క. అనయము గురుసంగయదేవుని గొలిచినయట్టిఫలము పొందుగ గణప
ద్వానజములు పూజగావించిన ఫలమునుదోడుతోడఁ జేకూరెబలే.

తే. అనుచు ముప మంది యప్పఁడయ్యనఘమూర్తి
శివనోటిప్రసాదంబు చేకొనంగ
నొకయుపాయంబు గని యట నున్న యిసుకి
జగతిపై ముష్టిమాత్రంబు చల్లుటయును. 106

క. అక్కజముగ నవ్వాలుక, చక్కెరపొడియైనఁ దత్ప్రసాదకణంబుల్
లెక్కఁగొన కప్పిపీలిక, యక్కడ నిడి పంచదారకై యరుగుటయున్.
క. ఆనంద మంది బసవఁడు, దా నాకణ మాత్మహస్తతలమున నిడి ఒల్
దీనునకు నిధియు వాడిన, చేనికి వర్షంబుపగిదిఁ జేకుఱె నాకున్. 108
ఆ. ఈమహాప్రసాద మిష్టలింగార్చన
చేసికొని కొనఁగఁ జెల్ల దనుచుఁ
బొలుపుమీఱ తనదు తలపాఁగకొంగున
విడకయుండ ముడియవేసి యంత, 109

వ. భక్తాగ్రగణ్యుం డైనకక్కయ్యగారి యంతర్గృహంబునకుం జని ప్రసాదోపభోగానంతరంబున సుఖగోష్ఠి నున్న యతనిం గాంచి వినయభక్తిప్రమోదంబులు ముప్పిరిగొనఁగ సాష్టాంగవందనం బాచరించి కరంబులు మొగిచి దేవా! బహుకాలంబుననుండి కాంక్షించుచున్న నాకు మద్భాగ్యంబు పిపీలికారూపం బై భగవత్ప్రసాదంబు గొనితెచ్చి యిచ్చె నేటికిఁ గృతార్థుండ నైతి ననిన నప్పరమపురుషుండు విస్మయం బంది గురుకటాక్షలబ్ధు లగువారి కెయ్యది యసాధ్యం బని తలంచి యతనితో ని ట్లనియె. 110

చ. అనవరతాఖిలాంచితనిశాధిపభూషణసుప్రసాదభా
జనరసనాంచలుం డనఁగఁ జాలిన నీకు మదీయకర్త నై
జననుతి గాంచు చెన్నయప్రసాదము సంభవమౌట! చోద్యమే
నను నొకపెద్దసేయుటకు న్యాయమె నీకు వివేకభూషణా! 111
చ. అని సగసంబుగాఁ బలికి యంపిన బండరతత్ప్రసాదముం
గొనుచు నాత్మగేహమునకుం జనుచో నెదు రేగుదెంచి పా
వనసుగుణాభిరామ శివభక్తిలలామ దయాబ్ధిసీమ యా
నన వగు నక్కనాగమ సమంచితసంభ్రమ మొప్ప ని ట్లనున్. 112
ఆ. ఎచటి కేగి తయ్య యిష్టలింగార్చన
సమయ మయ్యె వేగ స్నానవిధులు
సలుపు మనినఁ దనదు తలపాఁగ యొక్కచో
నునిచి తడుపు గట్టుకొని రయమున. 113
క. జలకం బాడఁగ నేగిన, నలినీదళనేత్ర యక్క నాగాంబిక యా

తలపాగకొంగుముడిఁగని, దలమగు సంశయము తన యెదం జనియింపన్.

క. నాముద్దుతమ్ముఁ డెన్నం, డేమియుఁ దా మూటగట్టి నెఱుఁగఁ డిదేమో
యీముడుపుఁ జూడవలె నని, ప్రామినకుతుకమున ముల్లె విదలిచి కాంచెన్.

ఉ. కాంచి గణప్రసాద మగుఁ గా యని సంతస మంది ఫుల్లనే
త్రాంచల మోదబాష్పయుత యై బసవండు గణాలయంబులన్
సంచితభక్తి వారల ప్రసాదము గోరికదీఱ మెక్కి యొ
క్కించుక దెచ్చె నా కొసఁగ నెంతయుఁ గూరిమి గల్గుఁ గావునన్.

ఆ. ఈప్రసాదమహిమ యెంచి వర్ణింపఁగ
నలవి యగునె తమ్మిమొలక కైనఁ
గలువవిరులతేనిఁ దలమానికము గాఁగఁ
దాల్చినట్టి దొరకుఁ దప్ప జగతి. 117

సీ. ప్రబలారివర్గద్విపప్రతాపంబున కంకుశం బగు నిమ్మహాప్రసాద
మతులితదుర్విషయావనీధరముల కశనిరూపం బిమ్మహాప్రసాద
మత్యుగ్రతాపత్రయాంభోదములకు ఝంఝానిలం బగు నిమ్మహాప్రసాద
మచలితమాయాబలాటవీస్థలమున కనలతేజం బిమ్మహాప్రసాద

తే. మఖిలవేదాంతవేద్యమౌ హరునిభక్తి
కాస్పదం బయి తగు నిమ్మహాప్రసాద
మలఘుతరనాదబిందుకళాత్మకంబు
తలఁపఁగా నిమ్మహాప్రసాదంబు జగతి. 118

క. అని కొనియాడుచు మోదం, బునఁ దద్దివ్యప్రసాదమున కతులితవం
దనము లొనరించి వేగం, బున లింగార్పితముఁ జేసి భుజియించె నటన్.

తే. బసవదండేశుఁ డామోదకుసుమవారి
స్నాన మొనరించి ధౌతవస్త్రములు దాల్చి
లీలఁ జెన్నొందు లింగార్చనాలయంబుఁ
జేరి చిత్రాసనమున నాసీనుఁ డగుచు. 120

తే. భూతి రుద్రాక్షమాలికల్ [illegible] దాల్చి
కరతలంబున నిష్టలింగంబుఁ బూని
సద్గురుఁ దలంచి [illegible] బిలిచి
నిరుపమానందభరితహృత్సరసుఁ డగుచు. 121

క. అక్కా! పాగాకొంగున
కక్కయ్యమహాప్రసాదకణ మున్నది నే
మక్కువ మెక్కఁగవలయును
జక్కఁగ కొని తెమ్మటన్న సతి యిటు పలికెన్. 122

క. పాగాకొంగునఁ బ్రసాద, మేఁ గని నా కొఱకు తెచ్చి తీవని కడకం
వేగ భుజించితి నన విని,తా గుండెగుభిల్లు మనఁగఁ దలపోసెమఱిన్,

ఉ. అకటా! నా కిపు డేల గల్గు? నిజచిత్తాంభోజపీఠస్థితాం
తకసంహారసదావిలీనచరణోద్యత్కృత్యకక్కాఖ్యభ
క్తకలాపప్రథితప్రసాదకసుధాకల్లోలినీసౌఖ్య మీఁ
గను సౌరభ్యము చేరుఱం గలదె లోకంబందు వీక్షింపఁగన్. 124

సీ. కారణజన్ముఁడౌ కక్కయ్యసత్ప్రసాదము గొన నెమ్మదిఁ దలఁప నేల?
తలఁచి పండ్రెండువత్సరములుపొంచ నాతోంటిపుణ్యంబునదొరక నేల?
దొరికిన నచట సంతోషినై మెక్కక తలపాగకొంగున దాఁచ నేల?
దాఁచిన నాగాంబ తత్ప్రసాదముఁ గని తోడరి నన్నడుగక కుడువ [నేలఁ

తే. కుడువ నేర్పరి మాయక్క కుమతి నేను
జేల నైనట్టి నాభోఁటి కేల గల్గు!
సంగమేశ్వరుకరుణ యీచాయ నుండె
నెంత చింత యొనర్చిన నేమి గాదు!. 125

క. వేమరు నిటు తలపోసిన, పామరునకు ముక్తిగలదె పామరుఁడినచో
నామంత భోగులు చేకొనె,నీమహిలోన నెడుమాట యే నిజమయ్యెన్.

క. అని యిట్లు నాగాంబా, వనజాతాస్యప్రకృష్టభాగ్యంబునకుం
దన మేలు లేమి కెంతయు,మనమునఁ దర్కించుచుండె నాటికినంతన్.

ఉ. భోగివిభూషణాజ్ఞ మెయి భూమికి వచ్చు మయూరవాహనుం
డాగమవేద్యసర్వమహిమాకరకక్కయసత్ప్రసాదస
ద్భాగమహిమంబున న్నిగుడఁ బోఁకనమై కనుపట్టె నిప్పుడీ
నాగమగర్భసీమ యిఁక నాకు మనోరథసిద్ధి గాంచితిన్. 128

క. ఈసు పతిమణి కడుపున, భాసురముగ పుట్టి కీర్తిఁ బ్రబలెద నని యు
ల్లాసమునఁ గార్తికేయుం, డాసతి గర్భమున వెలసి చెలువొందెన్.

క. జలజాయతాక్షిగర్భ
స్థలమందుఁ గుమారమూర్తి తగ సిల్చినచోఁ
దలమగుచు గర్భచిహ్నం
బులు గానఁగ నయ్యె జనులు ముక్కుమ్ముడువఁగన్. 130

మ. ఇది యేమో విపరీత మంచుఁ దనుఁ దా నేవంబునుం జెందుచున్
మదిలో సిగ్గున నెవ్వరిం గనక యానాగాంబ యున్నంత నా
సుదతీరత్నముచొప్పు గాంచి బసవేశుం డెంతయుం జింతచేఁ
జెదరం బాఱేఁడు చిత్తమందుఁ దలపోసెన్ బెక్కుచందంబులన్.

క. అవివాహ పుణ్యచారిణి, ప్రవిమలసద్భక్తియుక్తభావంబుజ యీ
ధవళాక్షి యిట్టిసింపం, దవులన్ వలసెన్ విధాతతల పేమందున్.

క. కలలోన నైనపురుషుని, దెలియం జూడసికళావతీతిలకము తె
క్కలిగర్భముదాల్చెనె యని,నలుగురువినినిందచేసి నవ్వఁగవలసెన్.

క. ఏమని యీఅడియుందుదు,నీమహిజనులాడుకొనెదుహీనోక్తులు నే
నేమని చెవులం జొనుపుదు, నామది నరిలేనిచింత నాటఁగవలసెన్.

ఆ. లోకనిందఁ బాపి మాకు సద్గతిఁ జూపి
యరయు మిట్టితఱి మహానుభావ !
నీవె దిక్కుసుమ్ము దేవ ! సంగయదేవ !
యనుచు గురునిఁ దలఁచుననునయమున. 135

సీ. బాగైనతగటంపు పాగలోఁ జెక్కిన
కమ్మపువ్వులబంతి గుమ్మె గులుక
నామీఁద బై నల్లెవాటుగాఁ వైచిన
జిలుగుగెంటెపుడాలు చెలువు మెఱయ
డాకేల నవిలింపు చంబైనగతనాల
కటియంబు గదలిచే ఘుల్లు వనఁగ
మెఱసింప నటించిన మెఱుఁగు గంధపుఁబొడి
మించి నల్దిక్కులు ముంచికొనఁగ

తే. గేల నందంబు గలబొంగరాకోల ననుఁ
నుదుట యొఱ్ఱనైనబూది సంపదలు నింప

వెడఁదయురమున లింగంపు వేటు దనర
సంగమేశ్వరుఁ డొకమిండజంగ మగుచు. 136

తే. నెదుట నిల్చినఁ గని బసవేశ్వరుండు
జంగమాంఘ్రిద్వయమునకుఁ జాఁగి మ్రొక్కి
వేదసూక్తుల నెంతయు వినుతిఁ జేసి
సముచితాసనమున నుంచి సంభ్రమమున. 137

తే. అర్ఘ్యపాద్యాదు లిచ్చి యయ్యనఘమూర్తి
పార్శ్వతలమున నంజలిఁ బట్టి భయము
భక్తియును నాత్మలోపలఁ బాదుకొనఁగ
వినయమున నున్న శిష్యునిఁ గని గురుండు. 138

తే. బసవ! నీమోము వెలవెలఁబాఱి యున్న
దేమి కత మని యడుగ నోస్వామి! యొకటి
విన్నవించెదఁ దోఁబుట్టువెలఁదికతన
యొక్కబలునింద సంభవ మొందె ననిన. 139

క. చింతలకు నిందకై యా, వంతయు నీమనసుతోన యంగన యితర
భ్రాంతివహించునె గర్భ,మంతమునకు వేఱె యొకకతము గలదనఘా.

తే. అంబ పులిననితంబ దయావలంబ
వృజినగిరిశంబ ముఖవిజితేందుబింబ
చికురపరిభూతరోలంబ శ్రీవిడంబ
డంబుగా నొకనాఁడు ముదంబుతోడ. 141

ఉ. రాజతశైలకూటనవరత్నమయాంచితసౌధమధ్యవి
భ్రాజితరత్నపీఠమున వాణిశచీప్రముఖాళి సేయనీ
రాజనిలోచనల్ గొలువ శ్రీ వెలుఁగొత్తఁగ నున్నవేళఁ దే
జోజితకోటిసూర్యుఁ డగుచున్ శరజన్ముఁడు వచ్చెఁ జెచ్చెరన్. 142

ఆ. వచ్చి సుతునిఁ జూచి వాంచి కేల్గవ సాఁచి
నాధనంబు కుప్ప నాదుహంస
నన్నుఁ గన్నతండ్రి నాపట్టి నాచిల్క
రార యన్న యనుచు గారవమున. 143

శా. తా ముద్దాడుచుఁ గౌఁగిలించుకొని మూర్ధఘ్రాణముం జేసి బ
ల్వ్యామోహంబున నంకమం దిడి తదీయాలాపముల్ ప్రేమచే
నేమేమీ యని మాటిమాటి కరుదై యింపొంద నగ్గింపుచుం
గామారిప్రియభామ తోష మొదవంగా నన్నచో నత్తఱిన్. 144

క. నాగేంద్రగమన యన మిహి
కాగతనూభవకుఁ బ్రియవయస్య యపుడు త
ద్రాగంబుఁ గాంచి యొకసఖి
తోఁ గేల్గాఁను మందబుద్ధి దోఁపఁగఁ బలికెన్. 145

చ. అరయఁగ నాత్మగర్భజుని యట్టుల నీశరజన్ము వేడ్క మీఁ
దరయక గాంచువారు తను నాలము సేయుదు రంచు నెన్న వే
గిరికరజాతముద్దు దిలకింపఁగ లాలన మాచరించె నో
కరివరయాన! యీ మెయెడఁ గాంచితి మెందున లేనిచోద్యమున్.

క. అని పెలుచఁ బాఱనవ్విన, వనితం దిలకించి కోపవహ్నికణంబుల్
కనుగొనలఁ జాఱఁగా ని, ట్లనియెం మిహికాధరాధరాత్మజ పెలుచన్.

ఉ. దైవతసంచయాధిప సుధాకరశేఖర వీర్యజన్ముఁ డౌ
నావరపుత్త్రుఁ గన్గొని మనంబున నోర్వఁగఁ జాల కిట్లు పా
పావహవాక్యముల్ సుదతి యాడఁగఁ గూడునె మేలుమేలు నీ
భావము గాన నయ్యె నికఁ బల్కులు వేయును నేల మాటికిన్.

క. ప్రేరితమునఁ నిటు నిం, దాలాపము లాడి నవ్వి తిటు గావున న
బ్భూలోకంబున నిందల, కాలయమై జననమందు మంబుజనయనా.

మ. అని యాతీగున శాప మిచ్చిన నసహ్యాయాద్రిజానవ్యప
ద్మవనజాతంబులపై నొరంగి ముఖలో దైన్యంబు రెట్టింపఁగా
ననిరు న్యాయణయాన తల్లి యిటు నాయం బొక్కయె గ్రించఁగాఁ
జనునే? నవ్వుచు నాకినట్టిపలుకుల్ సత్యంబుగాఁ గొందురే!. 150

ఉ. దాపుననుండి నీక వసుధాస్థలి సంభవమందు మంచు బల్
శాప మొసంగ నీ కగునె! జన్మము నొందఁగఁ జాలఁ దత్ప్రియం
బాపఁగదే యటంచు బహుభంగుల వేఁడిన గౌరి నెమ్మనిం
గోప మొకింత డిందుపడఁ గోమలి కిట్లనియెం బ్రియంబునన్,

సీ. తరుణి నాశాపంబు దప్పదు గావున
ధరణీతలమున నుద్భవము నొంది
పరిణయరహిత వై భక్తభుక్త్యవశేష
మాహాత్మ్యమున గర్భ మమరఁ దాల్చి
ప్రజ లెల్ల నిందింపఁ బండ్రెండువర్షముల్
భరియించి పుట్టెడుపట్టిచేఁన
లోకాపవాదంబుఁ బోకార్చి సద్భక్తి
చర్యచేఁ గొన్నివత్సరము లుండి
తే. మరలి యిటు రమ్ము నావుడు మగువ మ్రొక్కి
దేవి! నీయాజ్ఞ జనన మొందెదను గాని
యిక్కుమారుఁ గుమారుఁగా ని మ్మటన్న
నట్లయగాక యని గౌరి యానతిచ్చె. 152

క. నాగారిగమనయానతి, నాగాంతకవాహుఁడ య్యానందనుఁడను చుఁ
నాగేంద్రగమన ముదమున, నాగమవై జగతిపావనంబుగఁబుట్టెన్.

క. కావున నీతోఁబుట్టువు, పావనగుణశీల దీనిభావము దెలియం
గా వశమె యేరికైనను, నీ విం కిటఁజింతలుడుగు నిరుపమచరితా.

సీ. ఘనభక్తవర్యుఁడౌ కక్కయ్యసత్ప్రసా
దంబు గైకొనుమహత్త్వంబువలనఁ
దరలాక్షి గర్భంబుఁ దాల్చి తద్గర్భస్థుఁ
డై యున్నవాఁడు షడాననాఖ్యుఁ
డిటమీఁదఁ బదియు రెండేండ్లకు బిడ్డలు
సభ సర్వజనులు నాశ్చర్య మొంద
జననిదక్షిణకర్ణమునఁ బుత్త్రుఁ డుదయించు
ద్వాదశవత్సరబాలుఁ డగుచు
తే. నాతనికిఁ జెన్నబసవండ నెడునామ
మెలమి గావింపు మని వృత్త మెల్లఁ దెలిపి
సంగమేశుఁ డంతర్ధానసరణిఁ దాల్చె
బసవఁ డంతట లింగదర్శనమునందు. 155

సీ. పద్మాసనస్థుఁ డై పరమేశ్వరునకు హృ
త్పద్మంబు నెలవుగాఁ బరగువాని
బశ్చిమనాళసంభవఘంటికారవ
పరవశభావుఁ డై వఱలువాని
గడు నధోముఖము లౌ కమలంబు లాఱును
నూర్ధ్వముఖములుగా నొనరువాని
శశిరథస్యందనశర్మనిర్మలసుధా
స్వీకారవృత్తిచేఁ జెలఁగువాని
తే. నమలబిందుకళాతీతుఁ డైనవాని
నయుతసూర్యప్రభాభాసుఁ డైనవాని
నాత్మసోదరిగర్భమునందుఁ గాంచి
యాపె కెఱిఁగించి సంతోష మంది యుండె. 156

తే. ద్వాదశాబ్దంబు లంతట దఱియరాఁగ
నెలమితో నొకనాఁడు మహీశుఁ జేరి
గూఢచారుఁ డొకండు దాఁ గొంకి కొంకి
పలికె జోహా రొనర్చుచు భయము మిగుల. 157

క. జననాథ! నేఁడు ప్రోలం, జనియించిన వార్త లిపుడు సర్వముఁ దెలియ
న్వినివచ్చినాఁడఁ దెలుప, న్మనమున శంకింతు ననిన మనుజేశుఁడనున్.

చ. మనమున భీతి దక్కి మనుమానముఁ జెందకు మెట్టివార్త లై
నను వినుపింపుమా యనిన నాథునితోడుత గూఢచారుఁ డి
ట్లనుఁ బురిలో విధూజనము లంతట నింతట గుంపు గుంపులై
మనబసవన్నఁ జేరుకొని మాటికి ని ట్లనసాగి రెంతయున్. 159

క. బండారితోడఁబుట్టువు, నిండిన యశ మెల్ల వరదనీటఁ గలిపి తా
పెండిలిగాకటమున్నే, యుండె న్గర్భమున లజ్జ నొందెడుమదితోన్.

మ. బసవామాత్యుఁడు శైవజారవణసద్భక్తాగ్రగణ్యుండ సి
ద్వసుధ న్నా కెదు రెందు లెవ్వరను గర్వస్ఫూర్తినో తోడఁబు
ట్టు సరోజానన పీడఁజాలకయె మూఢుండై మనోవీధి సా
ధ్వసముం జెందక యంత గల్పుకొనె నెంత ల్పుట్టెనివ్వేటిలోన్. 161

ఉ. ఏమనవచ్చు నింక నని యింతులు కొందఱు పల్క నంతలో

తామరసాయతాక్షులు విదగ్ధులు వారి వదల్చి తాళరే
యేమిటి కీకఠోరపరిహేళనవాక్యము లయ్యమాత్యుఁడే
భూమివరుండు గాన మనబోఁటికి నేటికి? మాటి కిట్లనన్. 162

తే. అనుచుఁ బెక్కువిధంబుల నాడుకొనఁగ
విని తెలుపవచ్చినాఁడ నుర్వీకళత్ర!
యనిన నౌఁ గాక యని వాని ననిచి నృపతి
తనమనంబున నిట్లని తలఁచె నపుడు. 163

ఆ. బసవఁ డిట్టికలుషబద్ధుఁడై యుండుట
తెలిసి యూరకునికి వలనుగాదు
వసుధలోన సకలవర్ణాశ్రమాచార
సరణు లెల్లఁ జనవు వరుసతోడ. 164

క. సకలమెఱుఁగు 'రాజా రాష్ట్రకృతం పాపం' బటంచుఁ జదువులు భువిలోఁ
బ్రకటింపఁ దెలిసి నేనూరక యుండుట చనునె యనుచు సభ సముతోడన్.

ఉ. కంచుకి నొక్కనిం బిలిచి గ్రక్కున నేగి ప్రధానుఁ దోడితె
మ్మంచు ననుజ్ఞ యిచ్చినఁ దదాజ్ఞ శిరంబునఁ దాల్చి వేగ యే
తెంచి వినమ్రుఁడై బసవధీమణి! సద్వినయం బెలర్ప రా
జంచితలీల సి న్బిలువ నంపిన వచ్చితి నంచుఁ జెప్పినన్. 166

క. ఘనుఁడగు సచివాగ్రణి, తనపరివారంబు గొలువఁ దగుఠీవి మెయిన్
జని ధరణీనాథుఁ గనుం, గొని యుచితాసనమునందుఁ గూర్చున్న యెడన్.

చ. కనుగవ కెంపు నింప నలుకన్ బసవేశునిఁ జూచి బిజ్జలుం
డనియెఁ బ్రధానశేఖరుఁడ వై నుతిగాంచుట వన్నె కెక్క యి
ట్లనుచితవృత్తిఁ గిం దగిలి యగ్రజచీఁకటితప్పు నైనఁ గూ
డు నె కులశీలమానములు డొంకి చనన్ ధరణీతలంబునన్. 168

క. బలయుతులము మాకేమని, నలుగురిలో నిందఁ జెంద న్యాయమె మిమ్ముం
గలసి వసించుట మాకుం, జలకనయగుఁ గన్నె కెట్లు చూలయ్యె? ననన్

మ. ధరణీకాంతునిఁ జూచి యి ట్లనియె శాంతస్వాంతుఁడై కల్మషా
కరవాక్యంబుల లాభమే మిటకు నాకంజాక్షి రప్పింతు దు
ర్భరగర్భస్థితి దానినే యడుగుఁ డేర్పాటయ్యెడు న్మీకు నం
చు రయం బొప్పఁగ బిజ్జలానుమతిచేఁ జోద్యంబుగా నత్తఱిన్. 170

చ. తన కగు నాప్తు నొక్కరునిఁ దా దరిఁ జేరఁగఁ బిల్చి నీవు వే
చని యిట కక్కనాగమను జయ్యనఁ దోడ్కొని రమ్మటన్న న
య్యనఘచరిత్రుఁ డేగి సతియంఘ్రులకుం ధరఁ జాఁగి మ్రొక్కి మీ
యనుజుఁడు ధారుణీపతి సభాంతరమందున నుండి చెచ్చెరన్. 171

చ. అచటికి నిన్నుఁ దోడ్కొని రయమ్మున రమ్మని పంప వచ్చితిన్
విచికిలగంధి! యంచు సభవృత్తము లెల్ల నెఱుంగఁ జెప్పఁగా
నచలితచిత్తయై గురుపదాబ్జము లాత్మ ఘటించి మ్రొక్కి భ
క్తచయదయాకటాక్షమునఁ దార్కొను వేగ శుభంబులం చొగిన్.

క. మేలగు సన్మణిఖచితాం, దోలికలో నెక్కి సఖులు తో నడువఁగ న
బ్బాలామణి బిజ్జలుని స, భాలయ మటుచేరి యంతికావని నుండెన్.

క. అప్పుడు గోత్రాకాంతుం, డప్పావనిఁజూచి యజ్ఞుఁడై యాహా!యీ
యొప్పులకుప్పకుఁ జెప్పఁగఁ,జొప్పఁడని గుణంబు పుట్టె క్షోణీస్థలిపై.

ఉ. పాపుబ్రహ్మవ్రాత నగుపద్ధతి చప్ప దటంచు నెంచి యా
భూపపురందరుం డనియెఁ బొల్తుక! పెండిలి లేనియట్టి నీ
వేపగిదిన్ సగర్భ వయి తేర్పడఁ జెప్పు మటన్న భూమిభృ
చ్చాపపదంబు లాత్మ నిడి సాధ్వి ధరాధిపుతోడ నిట్లనున్. 175

క. ఏకర్మం బెఱుఁగని నే, నేకైవడిఁ దెలుప నేర్తు? నీగర్భస్థుం
డౌ కొమరునిఁగులు శిశువ్రం,బ్రాకటముగనడుగనాత్మపద్ధతిఁ దెలుపున్.

చ. అన విని విస్మయాన్వితహృదంబుజుఁ డై ధరణీశుఁ డెన్నఁడున్
విననియపూర్వవాక్యములు పింకిని యీసతిపల్కు లెట్టులై
నను గనుఁగొంద మంచుఁ జిఱున వ్వాలయన్ సభవార లబ్బురం
బని వినుచుండ నిట్లనియె నప్పుడు పెద్దతెలుంగున న్వడిన్. 177

వ. తద్గర్భాంతరార్భకు నుద్దేశించి. 178

ఉ. ఓహో! యీసతిగర్భదేశమున నేయోజం బ్రవేశించి తీ
వ్యాహారంబు వినంగ నీసభజనుల్ వాంఛించియున్నా రనన్
నీహారాచలకన్యకారమణపన్నీ రేజభక్తుండు క్రో
ధాహంకారమదాదిదూరుఁడగు కక్కయ్యాఖ్యభాస్వత్కృపన్. 179

క. ఈనాగాంబ గ్రహించిన, మానితదివ్యప్రసాదమహిమమువలనన్
నేనంగకలనఁ జెందితి, భూనాథ!యటంచు శిశువు పాలుపుగఁ దెలుపన్.

చ. విని సభవార లెల్ల నతివిస్మయ మందఁగ రాజు నెమ్మనం
బున నభవాంశుజాతుఁ డని బుద్ధి నెఱింగియు డింభకావలో
కనకుతుకంబుచే నమరి క్రమ్మఱ సిట్లని యెక్క ద్వదీయన
ర్తన మొనరింప మా కిపుడు చాలఁగఁ వేడుక యయ్యెఁ గావునన్.

చెన్నబసవేశ్వరావతారఘట్టము.

ఉ. పావకదర్శనం బొసఁగి ధన్యులఁ జేయు మటంచు వేఁడ న
బ్భావరవాక్యముల్ విని యపూర్వమహానుహిమంబుఁ జూపఁగం
భావమునం దలంచి హరుపాదము లాత్మ ఘటించి నాగమాం
బావరగర్భసంగతకుమారుఁడు భూరిగుణాఢ్యుఁ డయ్యెడన్. 182

గీ. తల్లికంటె నితరదైవంబు లేదని, సకలవేదసమితి చాటుఁ గాన
నట్టితల్లిబ్రాసనాయాస మొంరింప, దలనదనుచునొకయుపాయమెంచి.

చ. సురుచిరలీలదేహ మతిసూక్ష్మముగా నొనరించి దూషకో
త్కరముల వాక్ప్రబంధములు గాఁగ మెఱుఁగువిధంబునం దిగం
తరగతతేజుఁ డై జననిదక్షిణకర్ణము నిర్గమించి సుం
దరతను వొప్పఁగా నిలిచె ధారుణినాథునియంతికంబునన్. 184

క. అలరుల సోనలు గురిసెక్క, తెలివిం జెలువొంది సకలదిక్కులు నలమై
నెలకొనుచు దేవదుందుభు, లాలసెక్కనా గాంబికాత్మజోదయవేళన్.

ఆ. అపుడు తత్కుమారుఁ డంబికాంఘ్రులకు న
మస్కరించి తననుమతిని బసవ
దండనాయకునిపదంబుల కెఱఁగిన
లేవనెత్తి కౌఁగిలించుకొన్న. 186

గీ. ఫాలమున భూతి ధరియించి ప్రణవసహిత
శైవపంచాక్షరము కర్ణశష్కులికను
బోనిపి ఘనదివ్యలింగయుక్తునిగఁ జేసి
శిష్యునిగఁ జేయుకతన రోచిష్ణుఁ డగుచు. 187

తే. పదియు రెండేండ్లబాలుఁ డై యెదుర నిలిచి
వెలయు డింభకుఁ గాంచి యుర్వీవిభుండు
నిరుపమాద్భుతమందాత్మభరితుఁ డగుచు
నాత్మలోపల నవు డిట్లు లనుచుఁ దలఁచె, 188

చ. కులుచుఁదనంబు వచ్చు నని కొంకు వహింపక నిర్మలాత్ముఁడై
వఱలినయట్టి శ్రీబసవవల్లభుసన్మహిమంబు ముందుగా
నెఱిఁగి యెఱింగి యుండి యిపు డేటికిఁ గానిపరీక్ష చేసితిన్?
గొఱవిని నెత్తి గోకికొనుకూళలభంగి వివేకహీనతన్. 189

క. ఇప్పరమపవిత్రులకున్, జొప్పడునే యొక్క యఘము క్షోణీస్థలిపై
నెప్పాట నైనఁ జూడఁగ, నిప్పునఁ జెదలంట నేర్చునే వివరింపన్.

చ. అనుకొని దండనాథుఁ గని యాదొర యిట్లను నీవు సత్కృపం
గనినఁ దృణంబు మేరు వగుఁ గాదనినం దృణమౌను మేరు వో
యనఘ! నుతింప శక్య మగునయ్య? భవన్మహిమంబు లంచు మె
చ్చిన మృదుభాషల న్స్తుతి చేసె జనావళి చోద్య మందఁగన్. 191

మ. కమనీయామలరత్నభూషణములన్ గార్తస్వరాంభోమిళ
త్సుమహాచ్చేలము లిచ్చి గాఢతరసంతోషాత్ముఁడై యక్కనా
గమకున్ శ్రీబసవాదినాథునకు లోకవ్యాప్తి సత్కీర్తిసం
గమత న్మించిన యర్భకోత్తమునకున్ గల్యోత్సవం బొప్పఁగన్. 192

క. అంతట నాగాంబామణి, కాంతాసంఘంబు గొలువ ఘనసంతోషా
క్రాంతస్వాంతాంబుజయై, వింతగ నిజభవనమునకును విజయము చేసెన్.

సీ. బసవేశు డానందభరితాంతరంగుఁడై
  గజానుమతి చే విరాజమాన
సంతానశిబికపైఁ దనయుల్లు నెక్కించి
  తానును దో నెక్కి ధవళచామ
రాతపత్రంబు లనల్పంబులై యొప్ప
  భేరీమృదంగముల్ భోరుకొనఁగ
గణికాంగనానృత్యగానముల్ చెలఁగంగ
  వందిమాగధులు కైవార మొసఁగ
తే. కలితచతురంగబలము క్రిక్కిరిసి నడువ
వేత్రహస్తసాహస్రపవితతి గదువ
నమితోత్సవ[illegible]లంకృతం బైనపురము
రాజవీథుల నరిగె విభ్రాజితముగ. 194

చ. ఘనబసవేశు నర్భకుని గన్గొనెఁ బౌరనికాయ మప్డు శో
భనసహజాకృతిస్ఫురణపాటితశక్రతనూజకాములన్
వనరుహసంభవాదిసురవర్ణితదివ్యగుణాభిరాములన్
ధనదసఖాంఘ్రిసేవకహితప్రదనాములఁ గీర్తిధాములన్. 195

చ. ఎడనెడఁ గామినీమణులు హేమమయోన్నతసౌధవీథులన్
గడు ముద మొప్పఁగా నిలిచి సవ్యసుమాక్షతభవ్యలాజలిం
పడరఁగఁ జల్లి రంతట వృషాధిపుపై మఱి నాగమాంబికా
జడజముఖీతనూజుపయి సర్వజనావళి చోద్య మందఁగన్. 196

తే. జన్నిగట్టుము త్తైదువల్ జతల జతల
నిలిచి యాడాడఁ బుత్తడితళుకుఁబళ్లె
రములతో మంగళారతుల్ ప్రమద మెసఁగఁ
బట్టి యిచ్చిరి యమ్మహాభాగులకును. 197

క. విలసితమణిమయసౌధ, స్థలములపై నుండి చూచు తామరసాక్షుల్
తెలియఁగనొండొరుతోడన్, బలికిరి పికకలనినాదపద్ధతి నిటులన్.

సీ. నలినాక్షి! యీతఁడే నాగాంబికాకర్ణసంభవుం డైనట్టి డింభకుండు
ఘనవేణి! యీతఁడే గర్భంబులోపలఁబడియు రెండేండ్లున్న బాలకుండు
మానిని! యీతఁడే మారటరుద్రుఁడై యవతార మెత్తిన యర్భకుండు
చంద్రాస్య! యీతఁడే జనని నిందలఁ బాపి, పతి చేత మన్ననవడయు కుఱ్ఱ
తే. కంటిమిగదమ్మ కన్నులకఱవుదీఱఁ, బుట్టువులు నేఁడు సఫలతఁ బొందెఁగాదె
యనుచు నీరీతిఁ బురజనులందు నిందు, వినుతి సేయుచు నుండిరి వివి
[ధగతులఁ.

వ. మఱియును.

సీ. ద్వాదశాబ్దంబులు తల్లిగర్భములోన నుండు టేయాశ్చర్యము విదలార
యుండెఁబో తనుఁ బిల్వ మండలేశుని సభఁ బలుకుటంతకు వింత భామలార
పలికెఁబో యంతలోఁ బడఁతి కర్ణమునందుఁ బుట్టుట చిత్రంబు పొలఁతులార
పుట్టెఁబో తన తల్లి పొట్టనుండేండ్లతో నిలుచుట చోద్యంబు నెలఁతలార
ఆ. యీజనానుమోదుఁ డీభానునిభతేజుఁ, డీదయాసముద్రుఁ డీశుభాంగుఁ
డీప్రసాదజనితుఁ డెంతపుణ్యాత్ముఁడో, యెన్న నేరిశక్య మింతులార!

మ. కలికీ! శంకరభక్తులెల్లఁ బ్రమథు ల్గాకున్న నీవింత ము
న్నలనైనన్ గనుఁగొంటిమే! యిపుడు కన్యాఖ్యప్రసాదంబుచే

మొలచెన్ గర్భము నాగమారమణి కాముగ్ధ స్వీచారింప నే
తలపుం జెంప నెఱుంగనట్టి యబలం దప్పెంచుటే తప్పగున్. 202

చ. పరమపవిత్ర యైనసతిభావ మెఱుంగక కానిచేష్టలం
బరగెను నాగమాంబ యని పల్కితి మయ్యయొ! మున్ను నిందగా
దురితము వచ్చె నీయఘము దొల్గఁగఁజేసెడుమార్గ మెయ్యదో
హరహర! తెల్పిమాలిన జనావళి కెక్కడిసత్యవాక్యముల్!. 203

చ. అసమశిలీముఖాంతకముదావహమూర్త్యపరావతారమా
బసవనితోడఁబుట్టు నట భక్తవరేణ్యపదావలగ్నమా
నస యట సర్వపావనగుణంబులఁ బోల్పె నట యట్టిసాధ్వికిన్
వసుమతిలోనవేఱ యొకవాంఛ జనించునె? యెంచిచూచినన్.204

క. తెలియక యాడిన క్రింపటి, పలుకులవలనన్ ఘటించుపాతకమిపు డీ
యలఘుమహాత్ములఁ గనుటన్, దొలఁగెన్ సమకూరు ముక్తి తుది మన
[కరయన్.

చ. ఇటు వినుతింపుచున్ గరము లెత్తి నమస్క్రియ లొప్పఁజేయుచున్
బటహాథమామికాముఁరజబంధురనాదము లాలకింపుచున్
స్ఫుటనటనాదిచోద్యములు చూచుచు నచ్చెరువొందుచుండి క
క్కటకనివాసు లయ్యెడ వికాసమనోనలినాభిరాము లై. 206

క. ఈచందంబునఁ బురజన, లోచనపర్వంబుగాఁ గెలుగుచుం బ్రభులై
యాచకవాంఛిత మొసఁగుచు, ఖేచరులద్భుతమునొందికీర్తింపంగన్.

ఆ. రాజ్యలక్ష్మీనివాసమై ప్రణుతికెక్కు
నిజగృహమునకుఁ జనుదెంచి నిరుపమాన
భద్రదంతావళము డిగ్గి భాగినేయు
కరము చేఁబట్టి బసవఁ డక్కజము మిగుల. 208

క. కంచుకులుపాయఁదొలఁగుచు, టంచుఁబురోవీథినడుచహర్షముతోడం
గాంచనసింహద్వారం,బంచితగతిఁజొచ్చి యరిగి యచ్చోటరహిచేన్.

ఉ. ధర్మమణీసమంచితసభాభవనాంతరరత్నపీఠిపై
నిర్మలభావుఁడైన భగినీసుతు నుండఁగఁజేసి భూమిభృ
ద్ధర్మసమానమూర్తియగు తాను నందె వసించి కొంతసే
పర్మిలి సర్వచోద్యనివహమ్ములుఁ జూచుచు నుండి యంతటన్. 210

చ. నిరుపమకాంచనాంబరమణీమయభూషణసంతతిం గవీ
శ్వర బుధవర్య మౌరజిక వాంశిక వైణిక నర్తకాదులన్
సిరి దొలుకాడఁ దృప్తులుగఁ జేసి ముదంబున వారి నెల్ల మం
దిరముల కన్పి యబ్బసవధీమణి లోపలి కేగి వేడుకన్. 211

ఆ. గంగమాంబికాదికామినీమణులకు, భాగినేయుచేతఁ బ్రణుతిసల్పఁ
బనిచియప్పుడుచితపరివారయుక్తుఁడై, యొనరియిష్టగోష్ఠినున్న వేళ.

సీ. చీరలంటినభవుఁ జీరి క్రమ్మఱవాని నసుయుక్తుఁజేయుమాచయ్యగారు
పవడు చేపట్టి మేల్పసిఁడిగాఁ జేసి ప్రఖ్యాతి కెక్కిన కలకేతవరుఁడు
శరణపదాంబువుల్ చల్లి కట్టెలుపైఁడిఁ జేయు మోళిగమార శేఖరుండు
మృడుని చేఁబల్కించిమిత్తిపాలగుగొల్లప్రాణ మిచ్చినకిన్నరయ్యగారు
తే. వసుధలోపల నేడునూర్వత్సరములు
వేదమితి మీఱి వర్తించుమాదిరాజు
మొదలుగాఁగల జంగమంబులు మనోజ్ఞ
భరితసంతోషులై వచ్చి రురుతరముగ. 213

ఉ. వచ్చినఁ గాంచి యబ్బసవవల్లభుఁ డందఱే కర్థి మ్రొక్కి తో
డ్తెచ్చి సుఖాసనంబుల నతిప్రమదంబున నుంచి యల్లునిన్
మచ్చిక మీఱ వారికి నమస్కరణంబులు సల్పఁబంచి దా
హెచ్చినభక్తి నున్న్నెడ గణేశ్వరు లిట్లని రయ్యమాత్యుతోన్. 214

సీ. బసవ! నీమహిమంబు బ్రహ్మాదులకునైన వర్ణింపనలవియే? వసుధలోనఁ
దఱివచ్చినపుడు ప్రత్యయములుగాన్పింపనీకెచెల్లెనుగాదె నిత్యసత్య!
నీతోడఁబుట్టువైఖ్యాతికెక్కిననాగమాంబికమహిమ యేమనఁగవచ్చు
తత్కర్ణముననద్భుతంబుగఁ బుట్టినయిక్కుమారునినుతియింపఁ దరమె
తే. యొరపురత్నము లన్నియు నొక్కచోటఁ
దెచ్చి కూర్చినయీశ్వరు మెచ్చవలదె
యనుచు నుతియించి మఱియు నయ్యర్ఘ కేంద్రు
నెలమి నుద్దేశ మొనరించి యిట్టు లనిరి. 215

ఉ. ఈసుచరిత్ర మీవినయ మీయుచితజ్ఞత యీమనోజ్ఞభా
షాసముదాయ మీయచలజంగమపాదపయోజభక్తి యీ
భాసురశాంతియుం బసవభావమునందుఁ దలంచి చూచినన్

ద్రాసునఁ బెట్టి తూఁచినవిధంబున నీసరి వచ్చు మెచ్చఁగాన్. 216

సీ. శ్రీకరశివభక్తలోకపికంబుల కేధన్యచరితుండు మాధవుండు
జంగమసముదయచాతకాండజముల కేయనఘాత్ముండుతోయదుండు
శరణసముచ్చయచక్రవాకంబుల కేకృతార్థుండు ప్రభాకరుండు
కలితమాహేశ్వరగణచకోరంబుల కేసత్యసంధుండు హిమమయూ [ఖుఁ
తే. డట్టి యాదివ్యపురుషుని నభినుతింపఁ
గన్నులఁ గనంగ భాగ్యంబు గలిగెఁ గాదె!
యితని దర్శించుమాత్ర ముక్తిభయాన
వలచి పైకొనదే యెట్టివారినైన. 217

క. ఈవిధమున సకలావనిఁ, బావనముగఁ జేయ దుష్టపరమతశిక్షా
గావించి భక్తిఁ బ్రోవఁగ, నావిర్భవ మొందు నీమహాత్ముఁడు బసవా.

సీ. ప్రబలభక్తిజ్ఞానవైరాగ్యనిష్ఠల నీసరి గాననినిర్మలాత్ము
లీపేర పిలచుట నిఖలభక్తాభీష్ట మైయున్న దనుచు మాచయ్యముఖ్యు
లనపుడు నాతఁ డట్లగుఁగాక మద్దేశికాజ్ఞయు నీగతి యయ్యెఁ గానఁ
గరుణమీఱలునామకరణంబు సేయుఁడు నా పుడువారలందఱునుసమ్మ
తే. దాత్ములై చెన్నబసవరా జనుచు నుడువ
బసవఁ డత్యంతసంతోషభరితుఁ డగుచుఁ
జెలువు మీఱంగ జంగమంబులకు భూతి
వీడ్యములు వస్త్రభూషణవితతు లొసఁగి. 219

ఆ. దళితపాపులైన యలభక్తవర్యులఁ
దాను నెలమితోడఁ దత్త్వగోష్ఠి
సలుపుచున్న యట్టి సమయంబునం దొక్క
ద్వారపాలకుండు వచ్చి మ్రొక్కి. 220

శా. దేవా! యొక్కవిచిత్ర మిప్డు డతిదేదీప్యప్రభారమ్యము
క్తావైడూర్యపురంగరాశ్మముఖరత్నస్వర్ణసంయుక్తభూ
షావిద్యోతితహస్తయుగ్మమున భాస్వత్సత్త్వరాయాతమై
భావాశ్చర్యముగాఁ బడెన్ గడి బహిర్ద్వారప్రదేశంబునన్. 221

క. ఆకలితభూషణావళు, లాకరములు గనినశ్రీకరాకృతి దోఁచెన్
మా కెల్ల ననుడు బసవం, డాకాంక్షఁ దదీయవీక్షణారంభుండై.

ఉ. అచ్చట నున్నభక్తనివహంబును దానును సత్వరంబుగా
వచ్చి యపూర్వశోభలఁ గనంబడు హస్తయుగంబు గాంచి లో
నచ్చెరు వంది యప్వాతిశయంబులు నెచ్చటనుండి వచ్చెనో
యిచ్చటికన్నఁ జూడఁ డొకఁ డిట్లని పల్కె నమస్కరింపుచున్. 223

చిత్రకన్యకథ.

తే. అధిప! బిజ్జలుతోఁబుట్టు వైనచిత్ర
కన్య యనునది మదనవికార మొదవ
గుఱ్ఱముల కాఁపరిని గూడెఁ గులము నీతి
శీలమును మాన మెంచక సిగ్గుమాలి. 224

క. పెఱవాని ననుజ గూడిన, తెఱఁ గాప్రుడు పిళ్లవరద దెలిపినచో న
క్కొఱగానిమాటచెవులనుఁ, గొఱవిం జొన్పినటులైనఁ గుందెడుమదితోన్.

క. ఏమియుఁ బలుకఁగ దోఁచక, భూమిం గనుంగొనుచుఁ గొంతప్రొద్దుండి విభుం
డా ధన్యునితో ననునా, హా! మానిని యెంతసాహసాత్మక యయ్యెన్.

చ. సకలుషయై విభున్ విడిచి సాధ్వసమర్మము లుజ్జగించి బం
ధుకులము విన్నఁ దన్ను వెలిద్రోయు నటన్న భయంబు మాని యా
సఖి యొకయన్యమానవునిసఖ్య మొనర్చెఁగదే పయోజజా
తకృతముఁ బాయఁగా నెవరె ధారుణిలోపల నెట్టివారికిన్. 227

చ. అని మఱి యిట్లు పల్కుబసవాధిపుసోదరి నేనునింతచే
సినఫల మూరకే చనక చేకుఱు నా కిఁకఁ దోడుతోడునన్
న్మనసిజవైరికాంత కెన నాఁ జనుతత్సతి నట్లు పల్కఁ గాఁ
జనునె యెఱుంగనైతి గడచన్నపనుల్ నుడువంగ నేటికిన్. 228

చ. నలుగురు నింద చేసినను నవ్వఁగ నేకరణిన్ సహింతు న
క్కలుషమనస్కమోమెటులఁ గన్గొనఁజాలుదు నంచుఁ గోప మ
గ్గలముగఁ బూని గుఱ్ఱములకాఁపరిఁ గొఱ్ఱున నేయఁ బంపి లో
పలికి నయంబు మీఱఁ జని భావము గొల్వ వసించు చెల్లెలిన్. 229

చ. కనుఁగొని మోమునన్ వెనుక గానఁగనీయక నాతి యుండు ర
మ్మని సఖి నేకతంబ భవనాంతరసీమను మెల్లమెల్లఁ దో
డ్కొని చని దాను మున్నట నిగూఢత నిల్పిన నిల్చునారెకుల్
గనుకని మ్రొక్క భూధవుఁడు కామిని వారికిఁ జూపి యిట్లనున్.

క. ఈవనితం గొనిచని విపినావనితలమందు నొక్కయసియంత్రముపై
వైవ్రేఁదుతుత్తునియలుగా, నావృదుఁడు సోఁగాకయనుచు నతులైనంతన్.

చ. చెలియలిదిక్కు గన్గొనక చెచ్చెర నవ్వలి కొత్తఁ డేగినన్
దలఁపరు లంతటం దరుణి దవ్వులకుం గొనిపోయి చంపఁగాఁ
దలఁచి తదీయరూపమును దైన్యమునుం గని సంహరింపఁ జే
తులు వెస రాక యిట్లునికి దుఃఖితమానసు లొచు నొందొరుల్. 232

సీ. అక్కటా! శుద్ధాంతమందు నుండెడుతన్వికిశ్వపాలకసఖ్య మబ్బెనెట్లు
కట్టనుః జెల్లెలిఁ బట్టిచంపు మనంగ నాలుక యెట్లాడె నరవరునకు
మిగులసౌఖ్యాన్విత యగు రాజసుందరికీగతిపరమేష్ఠి యొచటవ్రాసె
సబలఁజంపఁగఁగూడదసిరాజుతోఁ దెల్పిమతిమంతులెవ్వరుమాన్పరైరి

గీ. దైవ మిటు తప్పఁజూచినతఱి మఱెవ్వ
రెంత చింత యొనర్చిన నేమిగలదు
కఠినుఁడగు రాజుఁ గొలిచినకతన నిట్లు
గోరి వధియింపఁగా నియ్యకొనఁగవలసె. 233

క. అని వగచివగచివిభుపం, పొనరింపక తీరదనుచు నొకయసియంత్రం
బునవైచిచనిరిచెలితు, త్తునియలగుచునఁనిమీఁపదొరుఁగఁగనంతన్.

క. మారుతరయమునదత్కర, వారిజములువచ్చియిచటవ్రాలెనటంచున్
జానుఁడు దెల్పిన బసవఁడ, వారతవిస్మయనియుక్తభావుం డయ్యెన్.

ఉ. అప్పుడు మిండజంగమును లచ్చెరు వందు చయాఁరె చేతులే
యిప్పగిదిం జనించె మఱి యీకరముల్ గలయింతిరూప మే
చొప్పున నుండునో యిపుడు చూడఁగనోఁ గద యంచుఁ గోరికల్
విప్పు దలిర్పఁగా బసవవీరునిఁ గన్గొని పల్కె రంజనున్. 236

మ. బసవాధీశ్వర! యీకరద్వయమునన్ భాసిల్లుపద్మాక్షినాం
పెసఁగంజూడఁగ వాంఛ చెందినది మాయిష్టంబు చేకూర్చి త
ద్బిసజాతానన నిప్డిధిన్ సనిచి ప్రీతిం జూపవే యిప్పుడో
యసమాస్త్రామితగర్వనిర్దళనపాదాబ్జాతపుష్పంధయా! 237

చ. వలచినవాంఛితం బొసఁగి వారవధూజనతామనోజ్ఞశ్రీ
లలఁ జరియింపఁబంచి మము లాలనసేయుట కెల్ల మూలమై
ఘలరుగదయ్య మామనవి యాత్మఘటింపుచు నీప్రయోజనం

బెలమి నొనర్చి తేసి యని హెచ్చుగు పేడ్కల వేడునంతటన్. 238
సీ. భక్తు లెయ్యది వేడఁ బ్రత్యుత్తరంబీక
యొసఁగు నేమము గాన బసవమంత్రి
తనతోడ మున్నుఁ జెప్పినచారుఁ బిల్చి నీ
వరిగి వేగంబ తదంగనాంగ
శకలంబు లన్నియు సమకూర్చి కొనిరమ్ము
నావుడుఁ జని విపినంబులోన
నాడాడఁ బడియున్న యత్తున్క లన్నియు
జతఁ జేసికొని వచ్చి సచివమౌళి
తే. యెదుట నుంచిన చారుని యిష్ట మొసఁగి
శరణసందోహమున కెల్లఁ జాఁగి మ్రొక్కి
సంగమేశ్వరు మదిలోన సంస్మరించి
యతులలింగప్రసాయతహస్తుఁ డగుచు. 239
తే. వెలఁదితనుఖండచయములు వేఱువేఱ
నేర్చి యంగాంగములు జతఁగూర్చి యచటి
భక్తపాదాంబువులు దానిపైనిఁ జల్లి
యించుక విభూతిఁ గొని చిలికించుటయును. 240
తే. తత్పదాంభోజజలము సంధానకరణి
పావనంబగు తద్భూతి జీవకరణి
యైన నిద్దుర మేల్కొను నట్లుగాఁగఁ
జిత్రకన్యక యపుడ సజీవ యయ్యె. 241
ఉ. మాదని మేల్కటారి చెలమావినిగుర్కొనుకొమ్మ మేలిబం
గారు మెఱుంగుతీవ రతికామిని కేలవసించుచిల్క సిం
గారపుఁగ్రొవ్విరత్నపుజాకాటపుబొమ్మ యనంగ నప్పుడా
వారిజగంధి నిల్చె బసవప్రభుమ్రోల విలాసధుర్యయై. 242
వ. ఆసమయంబున.
ఉ. అక్కడ నున్నమర్త్యనివహం బతివిస్మయసంగతాత్మయై
యెక్కడ నైనఁ జూచితిమె యిట్టివిచిత్రము ఛేదితంబులై
యక్కడ నక్కడం బడినయట్టి కళేబరఖండముల్ భళీ

యొక్కటఁ గూర్చి యీబసవఁ డొప్పుగఁ జేసె సతీ నతీవఁగాన్.

చ. ఇతనిప్రభావముల్ గనిన నీశ్వరుఁడే యగుఁగాక మర్త్యుఁ డ
మతి గనఁ బోలునే యనుచు మాటికి సన్నుతిసేయుచుండఁ ద
త్సతి బసవేశ్వరాంఘ్రిజలజంబులపైఁ బడి మ్రొక్కి పల్కె న
న్నతులభవత్కృపామృతరసాంబుధిఁ దేల్చి పునీతఁ జేయవే. 245

ఉ. నీకరజాత నొంట నతినిష్ఠురపాపభయం బణంచితి
బ్రాకటసౌఖ్యసంపదకుఁ బాల్పడి యుంటిఁ గాన నేక్రియం
జేకొని నన్నుఁ బ్రోచెదవొ నిర్మలచిత్త నొనర్చి ప్రోవవే
లోకనుతప్రభావ! యని లోలవిలోచన వేఁడునంతటన్. 246

తే. బసవనామాత్యచంద్రుండు ప్రమద మెసఁగఁ
గ్రమముగా నూర్ధ్వరేతయ్యగారిచేత
లింగధారణ మపుడొనర్పంగఁ జేసి
విమలసుజ్ఞానఁ గావించు నీని పిదప. 247

సీ. అక్కక్క-క్రమ్మఱ మ్రొక్కుచు నిట్లను బసవేశ నావిన్నపంబువినుఁడు
ధరణిపై నెవ్వరుశివమతముఖ్యదైవాభిధానంబుల నమరియుంట
జనవేద్యమే కాదె! సకలవిధంబుల నావేల్పు వరయంగ నీవె కాన
భవదీయనామసంప్రాప్తగా నన్నుఁజేసి యవనిఁ గీర్తిలఁ జేయు మనినబసవఁ

ఆ. డఖిలశరణసదలమానసంబులుగాంచి, నవ్వ నూరకున్న నగశరాస
భక్తు లతనిభావపద్ధతి బసవయ్యటంచు నామమిడిరి యబల కపుడు.

మ. అతిలీలాగతియై ధరం బరగునయ్యంభోజపత్రేక్షణాం
చితశోభాకలనాభిరూప్యవిలసచ్ఛృంగారముల్ గాంచి య
ద్భుత మొప్పన్ వడి నింకజంగమవరుల్ పుష్పాంబకోద్యచ్ఛరా
తతవైశ్వానరహేతికానిచయసంతప్తాత్మచేతస్కులై. 249

ఉ. అంగజకేళిఁ దేల హృదయంబులఁ గోరినవారి వాంఛితం
బంగద నూర్పఁబూని బసవాధిపుఁడాలజాక్షిఁ బిల్చి యీ
జంగమమూర్తులన్ గుసుమసాయకుక్రీడలోన నేలుపొ
మ్మంగన! యన్న మ్రొక్కి జలజానన వేడ్క వహించె నీగతిన్. 250

క. క్షితితలమునఁ బొకసతి కొక, పతియుండినయోగ్యమనుచు భాసిలుగాకే
గతి వలఁప నొక్కయువతికిఁ, బతిబాహుళ్యంబుయుక్తపద్ధతియగునే.

క. మితిలేనిజంగమావళి, మతివాంఛలు తీర్పఁగా సమర్థుఁడె నాకీ
గతి కల్పింపక కరుణో, న్నతిచే మీదాసిచేసి నను బ్రోవఁగదే.

చ. అన బసవేశుఁ డిట్లనియె నంబుజపత్రవిశాలనేత్ర! యి
ట్లనఁ బనిలేదు భక్తనివహమ్ములఁ గామసుఖాభిలాష లిం
పెనయఁగఁ దీర్ప నిన్ను సృజియించె శివుం డటుగానఁ జింతలం
జనకు మదీయసత్కరుణసత్త్వసమర్థత గల్గు నీ కికన్. 253

తే. పొమ్ము వారియధీనవు గమ్ము నిన్నుఁ
గ్రమ్ముకలుషమ్ములను విడఁజిమ్ము మదిని
నమ్ము నామాట మేలు చేకొమ్ము సుస్థి
రమ్ముగను ముక్తి దొరకు నిజమ్ము సుమ్ము. 254

చ. అని నవలా నొడంబఱచి యాత్మల సువ్విళులుం గుమిండభ
క్తనిచయముల్ ముదం బలరఁ గన్గొని మీరలు వేడ్క నీశుభా
ననవలనన్ ననోబ్జముల నాటినకోరిక లెల్లఁ దీర్చికొం
డని యనుపన్ నడిం జనరి యంగనఁ దోడ్కొని వార లందఱున్.

క. ఈకరణివారలేగఁ గృ, పాకరుఁడగుబసవమంత్రి యద్భుతమహిమం
బాకాంతుంగొనియాడుచుఁ, బ్రాకటమహిమాఢ్యమాదిరాజప్రముఖుల్.

తే. నాగమావలోకనమునకు హృష్టులై
యంతిపురికి వేగ నరుగువారి
నమ్మృగాక్షి చూచి హర్షంబు సద్భక్తి
దొలుక వందనములు సలుపునంత. 257

క. వనజాక్షిభక్తివైరా, గ్యనియమసూపశక్త్యనిష్ఠ లాత్మలఁ దసు ముదం
బొనరింపఁ బెక్కువిధుల, న్వినుతింపుచునొక్కహర్మ్యశిమంతలమునన్.

చ. బసవనితో సమస్తశివభక్తనికాయ మతిప్రమోదహృ
ద్విసరుహాయుక్తమై మహిమ నెంతయు సన్ సభ దీర్చియుండె నిం
పెసఁగ హిమావనీధరసుతేశ్వరసంగతమై నిరంతరో
ల్లసనము నొందునాప్రమథులం బురణించి విలాససంపదన్. 259

వ. అని చెప్పినఁ గుంభసంభవుం డవ్వలికథ యెఱింగింపు మనుటయు.

మ. మిహికాహార్యసమానధైర్య! మధురామేయాబ్జసౌందర్య! పూ
ర్వహరిద్రాజితధైర్య! శౌర్యఘనపారావారగాంభీర్య! దు

స్పృహా తేజోజితసూర్య! భాసురమనీషా దేవతాచార్య! వే
దహాయాంఘ్రిద్వయసంతతార్చనకళాతాత్పర్య! వీర్యోన్నతా!. 261

క. లబ్ధనికాయవిదూరా!, యబ్ధిసమగభీర వైరిహరణవిచారా!
లబ్ధశివాచారా! ప్రా, రబ్ధసుకృతభవశరీర! రమ్యాకారా! 262

తోటకవృత్తము. శ్రీకరబంధువశీకరచర్యా!, ప్రాకటభూపరిపాలనధుర్యా!
లోకనుతేశ్వరలోచ్ఛ్రయధైర్యా!, భీకరశత్రువిభేదనశౌర్యా!. 263

గద్య. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్ష లబ్ధకవితామాధురీ ధురీణ కౌశికగోత్రపవిత్రకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతంబైన చెన్నబసవపురాణంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము



# ద్వితీయాశ్వాసము.





మద్భ్రమరాంబాహృ
త్తామరసవిహారషట్పదన్మల్లోక
స్వామికృపాలబ్ధశుభ
స్తోమా శ్రీయమృతలింగశోభననామా. 1

వ. అవధరింపు మయ్యగస్త్యమునీంద్రునకు రేణుకగణాధీశ్వరుండు తరువాతివృత్తాంతం బిట్లని చెప్పందొడంగె. 2

చ. అటు వసియించు భక్తనిచయంబులు జంగమసత్ప్రసాదవి
స్ఫుటమహిమల్ వినం దివిరి ఘోరథమూర్తి దిగంతపూరితో
త్కటనిజకీర్తియై వెలసి ధన్యతఁ జెందిన మాదిరాజు హృ
జ్జటిలముదంబునం గని రసస్ఫురితోక్తులఁ బల్కె నీగతిన్. 3

మ. అనఘా! శైవరహస్యముల్ భవదభివ్యక్తంబులై యుండుఁగా
వున శ్రీజంగమసత్ప్రసాదమహిమంబుల్ దెల్పి రక్షింపవే!
యన నాథన్యుఁడు మున్ను మీకరుణ నావ్యంబైన భక్తాళిచే
వినిన ట్లే వచియింతు నంచుఁ బలికెన్ విస్పష్టమౌనట్లుగాన్. 4

తే. అమృతసంధాయకంబయి యప్సరఃప్ర, పూర్ణమైమత్తసారంగకీర్ణమై చ
రన్మరుద్వారగంధర్వరాజమగుచు, నతిశయిల్లె శ్రీజీమూతమవనియందు.

వ. తద్గిరీంద్రంబున. 6

మ. అకలంకోజ్జ్వలమల్లికార్జుననుతివ్యాహారయుక్సారికా
శుకముఖ్యాండజనాథసంశ్రుతిముదస్తోకప్రరోమాంచకం
చుకదేవర్షినివాసదేశవిలసచ్ఛోభావహచ్ఛాయద
ప్రకటాహ్లాదిమహీజమౌ కదళికారణ్యంబునం దొక్కటౌన్. 7

గంధర్వునికథ.

క. కమలాధివాసవిలస, త్కమలాసవపాయిభసలకమనీయంబుల్
గమలీకకిరణశీతల, కమలంబగు నొక్కకొలనుగడువెలుఁగొందున్.

క. తత్తీరంబున గంధ,ర్వోత్తముఁ డచలుండునై మహోక్షతురంగుం
జిత్తమునం దిడిసురముని, సత్తములగ్గింపఁ దపముసల్పుచునుండెన్. 9

ఉ. అంతట నొక్కనాఁడు నిటలాక్షపదార్చకు లాజవంజవ
భ్రాంతివిదూరు లంతరచరద్రిపుదూరులు యోగమార్గవి
శ్రాంతులు పంచవర్ణమనుజాధిపమూర్తులు నైనశాంతుఁ డే
కాంతుఁ డనంగ నిద్దఱుమహాత్ములు శ్రీగిరి సంచరించుచున్. 10

తే. అచటి జంగమదివ్యగేహంబులందు
మాధుకరభిక్షఁగొని శివారాధనంబుఁ
జేసి భుజియింత మనుచు విలాస మలరఁ
దత్సరోవరతీరంబు దఱియ నేగి. 11

సీ. విమలమౌనొకచోఁ బ్రవేశించి తద్భక్తమంబులఁగడిగిపాత్రంబులందు
నించియోంకారయుక్పంచాక్షరీమంత్రపూజితలోపేతభూతిఁ జల్లి
యిష్టలింగార్చన నెలమితో నొనరించి యర్పితంబగు తన్మహాప్రసాద
మొనటికడికడికగపఱచుచుభుజింపుచు లింగయోగవిస్ఫూర్తినున్న

తే. వారలను దత్సమీపనివాసమందుఁ
దపము సల్పుచునున్న గంధర్వవిభుఁడు
వీక్షణము చేసి తచ్చర్య వెగటు దోఁప
నిట్టు లని పల్కె నజ్ఞానహృదయుఁ డగుచు. 12

చ. శివు ధరియించి సంతతము శ్రీ[illegible]బాణునిఁ బూన్చు చూత్మసం
భవహరుఁ జిత్తమందు నిడి [illegible]లోచనలాంఛనంబులే
యవిరళభక్తిఁ దాల్చి ఘను [illegible] నన వర్తిలు మీఱ లీగతిన్
సవనవిరోధి కెంగిలిప్రసాదము కొంకక యిచ్చు టొప్పునే. 13

క. నరులెవ్వారైన మీఁగతి, హరునకు నిటుభక్తిసేవ మర్పించుట యీ
ధరణీతల మునఁగలదే, దురితాత్మకులార యనుచుదూషించుటయున్.

మ. విని కోపజ్వాలనావృతాత్ముఁ డగుచున్ వేగంబ గంధర్వునిం
గని యోమూఢ! మహాప్రసాద మెఱుఁగంగా లేక యుచ్ఛిష్టభా

వన దూషించితి గాన నీయఘము పోవం జాలఁ దేవెంట నీ
ఘన తేజం బఱ గ్రామసూకరవు మేఁకాైగెకొమ్ము పొమ్మిం కేటన్. 15

చ. అనవుడు భీతి నొంది వినయంబున నిట్లనుఁ గేలు మోడ్చి యో
యనఘతరాత్ములార ! తెలియం గనకే విుము నాడినట్టి దు
ర్వినయవచఃఫలం బనుభవింపక తీఱునె యింక శాపమో
చన మెటు లయ్యెడుంకా దెలిపి సంతస మందఁగఁ జేయరే! యనన్. 16

ఉ. కోపము మాని యిట్లనిరి కొన్ని దినంబులు ధారుణీస్థలిం
బ్రాపితపోత్రిరూపమునఁ బర్యటనం బొనరింపుచుండి రు
ద్రాపరమూర్తియైన శరణాగ్రణి డించుప్రసాద సేవఁ ద
చ్ఛాపము వీడి హేమగిరిచాపునిప్రాపునఁ జేరె దెట్లనన్. 17

తే. అమృతసంపాదకంబుఘోరాఘమోచ, నాదికారణమైనదివ్యప్రసాద
మేవగింపఁగవచ్చినయేనవింతర, గతిఁ జెడదుతత్ప్రసాదభోగమునఁగాసి.

క. అని జంగమవరులొసఁగిన, ఘనశాపాక్రాంతుఁడగుచుగంధర్వుఁడుశో
భనసజరూపముగోల్పడి, కొనియెంపత్తిణమ గ్రామకోలముహూపున్.

చ. కొఱకొఱ లాడుచుం బుడమి గ్రుచ్చుచు బల్విఱతోడ నోరగాఁ
బిఱిఁదికిఁ జూచుచుంకా గడుపువేగున వంకరగాఁగఁ బోవుచుంకా
గఱకఱ పండ్లు గీటుచు నెగంబడి ముట్టెను దుంగముస్తైలం
బెఱలిచి మేయుచుంకా బొదలతీఁగల డాఁగుచు నేగె జాగునన్. 20

క. ఈకరణిం జనిచని యా, సూకర మూరూరఁదిరుగుచుంజనుచును శో
భాకలన ధరిత్రి లస, న్నాకంబగు విజయవాటినగరము చేరెన్. 21

తే. ఆపురంబున నెపు డుంపుఁ గాపురంబు
నెఱుకకులమున జనియించుఁ బెరుకుపుండ్ర
పామరుం డనఁ గలఁ డొకపామరుండు
సకలకర్మసుగుణరాశి సత్యరాశి. 22

వ. వానియాలు బండంగి యనునది. 23

బండంగి కథ.

సీ. సం దెఱంగినదొంగ సాటెనగొట్టు పిసాసి దిమ్మరి జెరజముబటాని
తప్పనగొండి పోతరకత్తె కల్లరి వల్లింత మాయలబెల్లి కటికి

నక్కచిక్కులమారి పెక్కురురూపిదూబరదిండిబొంకులచాన మొండీ
బొజుఁగులాఁడిలడారి బిల్లిపల్లాకిజూదరియబ్బెరాసిగాతలకోటారు

ఆ. మగనికంటిసెరసు వగలాఁడి శివసత్తి
బలుగయాళి పొరుగుపాలిజాలి
మందులాఁడి చెడుగుమానిసి బూతంబు
పిసిఁడి బిచ్చగాండ్ల వెన్నుగుడియ. 24

ఆ. అట్టివారి యింట నటుతగా నున్నట్టి
పెరటిపంచలోన గుఱుకు లిడుచు
నచట నచటఁ దిరిగి యల పంది యలపంది
పండియున్నఁ బుండ్రపామరుండు. 25

చ. కని సతిఁ బిల్చి యుక్కిటిని గాఁపిసి చూచితె యెన్న! డిప్పురిఁ
గనుఁగొను పంపిగా దిది దినంబును గంజియుఁ గాటఁ బోసి పెం
చినసిటనుండు నంచుఁ బతి చెప్పిన సంతసమంది దాని నో
య్యనఁ దరిఁ జేరఁ బిల్చి పులియంబలి యించుక వోసె మూఁకుటన్.

ఆ. అంబకళము ద్రావి యది మొద లాపంది
యెచటికి కరుగఁబోక యెఱుకునింట
గంజికడుగుచేతఁ గడుపు నింపుచుఁ గొంత
కాలముండె జాతిగతుల నంత. 27

సీ. శివరాత్రికతిభక్తి శ్రీశైల నల్లభుఁ గనువేడ్కవృద్ధజంగమ మొకండు
చనిచని బెజవాడ సాయంతనమునకుఁ జేరి పేరాఁకటిచిచ్చుచేతఁ
బడలేక భిక్షుకై భవభక్తభవనంబు లెచ్చోటఁ గల వని వచ్చివచ్చి
యెఱుఁగఁజాలక యిది కఱకంఠుభక్తమందిర మని పుండ్రపామరుని [యింట

తే. కరిగి తద్ద్వారదేశమునందు నిల్చి
ఘంటవాయించి తోడ శంఖంబు నొత్తి
భిక్ష యనవుడు బండంగి విని యడంప
రానికోపంబునను మందిరంబు వెడలి. 28

సీ. కనుఁగొనె విభులఁ గ్రమ్మినమేను వాలిన
కనుబొమల్ లోఁతులౌ కనుఁదోయి

వణఁకెడుశిరమును బెణఁకెడు గమనంబు
భగ్నదంతావళి పక్కకంతి
జొల్లుగారెడు నోరు తెల్లనిగడ్డంబు
తెగనిశ్లేష్మంబుచేఁ బగులుమాట
వెన్నంటు డొక్కయు సన్నపుఁజేగోల
పాడివగ్గు కాకిమూపులును మఱియు
తే. జడలు కక్షపాల గోఁచుగు జీర్ణపుగంప
చెవులఁ బగులుబడఁగ చింపిగోఁచి
మెడను శివనిసెజ్జ రుద్రాక్షలును బూది
యమరు ముసలిజంగమయ్య నపుడు. 29
చ. కనుఁగొని దాయ వచ్చి శునకంబువిధంబునఁ గిక్కరించి యి
ట్లను నను నొంటి నుండఁ గని యద్దము గతిరికాడ భిక్షమున్
గొను నెప మూని వేఱొకటి గోరిటు వచ్చినజాడ దోఁచె నా
చెనిమిటిఁ గన్న సిన్నిదుము పెట్టక యూరక పోవనిచ్చునే?. 30
ఉ. కల్లరులైన యాపరుగుకాంత లెఱింగిన గోలి సేయుచున్
వొల్లిట్టివైర మెంచి పతితో వినుపింపక పోవ దంతతోఁ
జెల్లును నాదు కాఁపురము చిక్కిన నీకును భంగపాటగున్
గొల్లముగాఁగ నింక నిట ద్రిమ్మరఁ గూడదు పొమ్ము క్రమ్మఱన్. 31
క. అనియది పల్కినమాటలు, విని యంగమమూర్తిమదికి వెగటుగఁదోఁపం
ఘనశివాయసిర్ణము, లనుగనములఁ జేర్చి చక్కిలంబడియ నిటులన్.
ఉ. అక్కరో! యిట్టు లాడఁ దగునమ్మ? సర్వాత్మ గామచారియా
తెక్కలికాని నాడుపగిదిన్; సిరిగట్టునివాసుఁ గొల్వఁ బె
న్నక్కువ నేగుచో జనసమాజము గూడఁగ లేక యొంటిగన్
దక్కుటచేత భిక్షుకయి చేరితి నీగృహసీమ కోమలీ!. 33
ఉ. కాలము సర్వముం గడచి కార్శ్యము మేనునఁ బొంది వృద్ధుడై
కాలు గదల్పలేని ననుఁ గాముకికారి యటన్న నవ్వరే?
చేల ప్రథానుమానముల నేచఁగ బిచ్చము తెచ్చిపెట్టినం
జాలు మఱేమియున్ వలదు నాపుడుఁ గోపముతోడ నిట్లనున్. 34

క. ముదిమది దప్పెనొ పైత్యము
గదిరెనొ యటుగాక యుమెతకాయ నమలితో
మదనారిభక్తవర్యుల
సదనములకుఁ గాక యిటకుఁ జనుదే నగునే?. 35

వ. అనిన నతం డిట్లనియె. 36

తే. నెలఁత! నీ వనుమాటయే నిజముగాని
మాకుఁ గల దొక్కవ్రత మేరిమందిరమున
ముసుపు వేఁడితి నచట నగొనఁగవలయుఁ
గాన నగుభిక్ష పెట్టుము గడప వలదు. 37

క. నాపుడుఁగామినియిట్లను, మావంగడమందు జంగములకు బిచ్చం
బానంతపెట్టనొప్పదు, నీవెఱ్ఱితనంబు మాని నిలువక చనుమా. 38

ఆ. అనినజంగమయ్యయని యెందొల్లిటివారి, చర్యలెల్లనూరసాని మొదలు
శైవవరులు పూజసేయుటచేఁ గాదె!, యిహపరార్థసిద్ధు లెల్లఁ గనిరి.

క. కావున జంగమవర్యుల, సేవించుటవలనఁ గీడు చెందుట గలదే!
కేవలపాపపువాక్యము, లీవిధి జను లెవ్వరైన నిల నన గలరే? 40

చ. అన విని క్రోధఘూర్ణితనిజాననయై శివసత్తికై వడిన్
విన వెగటైన పల్కు లివియే యన నేటికి? వారిచాడ్పునన్
ఘనమగు కొల్చుగాదియలు గల్గినవారము గాము మిన్నకే
చను మిఁక నిచ్చితేని నెలుచన్ నినుఁ గొట్టక మాన గట్టిగన్. 41

ఆ. ఆఁకటనుగొ వ్యంజాలనే సంపాదించి, గంప తాకట్టుగానుంచికడుపునింపఁ
గుడుపునిచ్చుటసిద్ధిఁగాఁబడి తెలంగ, వాంఛనారలినఁ లుగ దుత్థ్యము

చ. అడిగినచోట భిక్షఁ గొనునట్టివ్రతంబున నొంకుచోట నే [సిన.
నడుగంగఁబోదు నే! తగినయట్లు యొసంగక పోవఁగ వనన్
జెడుఁగుపిసాసి బల్గుడియ చేరొసి జంగమసామ్యంచుఁ గొ
న్నాడిఁ గతియంగఁ బోన్నుతజినాంతిముగం పసు వెంచి చెప్పెసన్. 43

ఉ. కోమలి! యేల భిక్షుకుని గొట్టఁగ ... నన్ను నాథుతోఁ
గాలిని పల్కునట్టి తగ ... సనిన న్వాని పోక భిక్షకై
గాను తెలంగునన్ సగిలెఁ గాపున గొట్టక మాన నన్న న
ప్పామరుఁ డాలితో నిటులఁ బల్కె నయాసము పేతచిత్తుఁ డై. 44

ఆ. వృద్ధు వేళగానివేళ నాఁకట డస్సి, వచ్చినాఁడు గాన వలదు గడుపఁ
గలుగుకొలఁది పెట్టుమలుక యేమిటికిటు,లనినవిభునిపల్కు లరుచిదోఁప.

ఉ. ఈనడుపీనుఁ గెక్కఁడ మతెవ్వరిఁ గానక వచ్చె నంచుఁ గో
పానన యాచు నెక్కడివ్యయం బరుసెంచె నటంచు నాథు లో
లోన గొణంగి తిట్టుచు విలోలతఁ దోఁచక సంచరించుచుః
దా నిటు కొంతప్రొద్దుఁ గడుతల్లడ మంది యొకింత కిన్కతోన్

ఆ. తనదుప్రాఁతమగఁడు మనిన నాఁ డొకమూల
దొంతిసందలోన దొంగతనము
వనర డాఁచినట్టి తమిదెపిండి యొకింత
పెట్టి పొమ్మటన్న భిక్షుకుండు. 47

సీ. అఖిలంబు నెఱుఁగ 'క్షుధాతురాణాం న రు
చి ర్న పక్వం' బనఁ జెల్లుఁ గాన
నాఁకటి పెల్లున నప్పిండియంతయు
నతివేగమునఁ గొని యాత్మలింగ
మునకు నివేదనం బొనరించి యుంచుక
యారగింపం బొడియగుటఁ గుతుక
కడ్డమై యవ్వలి కరుగక యున్న నూ
ర్పిడలమిఁ గేల నెత్తసఁచి కొనుచు

తే. డిల్లపడి యిలపై బొరగిల్లి కొంత
తడవునకు లేచి కూర్చుండి పరిన నిల్చి
నెఱుకుజవరాలిఁ గనుఁగొని యెలుఁగు రాక
సన్నముగ నిట్టు లనియెఁ నజ్జంగముండు 48

క. కనుఁగొనిన మనికసహ్యత, యని నెడిమీఁ బ్రాఁతసున్ని తగ నాకై డాఁ
చినదానవెచాలుసుమా,యనిమిగిలిన వచటనుసిచియతఁడేగెవెసన్.

చ. అనుపతజాత్కుఁ డిట్లరుగ నంతట నక్కలుపాత్మ యాప్తలై
తన రెడికాంతలం బిలిచి తామరసాయతనేత్రలార! నా
పెనిమిటి సేయుడండుగము వింటిరె! తా నొక పెద్దదాత నం
చును గృహ మెల్లపాడి చెసఁ దలపోసె వివేకహీనుఁడై. 50

ఉ. ఎక్కడనుండి వచ్చెనొకొ యీముదిజంగము వానిమాయలో

చిక్కి తరాలనుండి యొకచీమకుఁ బోవఁగ నీక డాఁచునా
చక్కనిపిండి వ స్త్రదిమి సర్వముఁ బెట్టఁగఁ బంచె నింక నే
నెక్కరణిన్ వసింతు మఱి యెత్తి ప్రియం బొనరించుపీనితోన్. 51
క. అప్పిండియుఁ బులగముపైఁ, బప్పుగతిన్ సైఁపకతఁడు పాఱఁగఁజల్లెం
దప్పొనరించితి నెచటనొ, తప్పఁజనినవానిమీఁద పయదలఁచుదురే.
ఆ. ఏననేకపతుల నెనసి కాఁపురముంటిఁ, గానియింత బెరుకువాని నెఱుఁగ
జంగమయ్యతోడ జరుపుఁగాఁపురము దా, నింకననుచునువిదయిల్లువెడ
ఉ. తోడన యేగి పామరుఁడు తొయ్యలిఁ జక్కఁగఁ బట్టి నాతి! నిన్ [లె.
వీడి నిమేషమేనియును నే వసియింపఁగ నేర యిట్టులం
గూడుసె నాపయిం బెలుచఁ గోపము సేయక తప్పు సైఁచి ర
మ్మేడకుఁ బోయె దంచుఁ దనయింటికిఁ దోడ్కొనివచ్చె క్రమ్మఱన్.
చ. అటు చనుదెంచుమున్ తపసి యచ్చట డించుప్రసాద మప్పు డ
క్కిటి భుజియింపఁ గాంచి కడుఁ గేరుచు సొమ్ముని సొమ్ముఁ జెందవే
లిటు వసియింపఁగా వలువదే? మనభాగ్యములంచు నత్తఱిన్
దటుకున నిల్లుఁ జొచ్చి ప్రమదంబున సిద్ధురఁ జెంది రిద్దఱున్. 55
తే. అంత నప్పాత్రి భక్తిసిశాంతజంగ, మప్రసాదోపభోగసన్మహిమవలన
విమలసుజ్ఞానమాత్మఁబర్వినగిరీశ, భక్తులిచ్చినశాపంబువాసె ననుచు.
వ. ప్రమోదంబు నొంది యప్పుశద్దేహంబు విడనాడి గంధర్వరూపంబు వహించి ఈశ్వరపదంబు నొందం దలంచియు నంతలోన తన మనంబున. 57
ఆ. ఇక్కిరాతవర్యు నింట నుండుట సుఖ, నైతి సత్ప్రసాదమబ్బె శాప
ముజ్జగింప గంటి నొక్కమేమైన నీ, తనికిఁ బ్రత్యుపకృతి దప్పు గాదె.
క. కావునఁ బ్రత్యుపకారము, ... ముక్తిఁ గైకొన ... నే
నేవిధి నంటిద్దాఁకన్, ... నమునందు నిల్లుఁ బ్రొత్త్యాకృతి చేన్.
వ. అని ... యుక్కశివాలయప్రాంతంబున నిజజన్మ...రనంబులు మాసి ఈశ్వరపదధ్యానం బొనరించుచు నుండె నిచట. 60
క. తెలవాఱుటయుఁ గిరాతుం, డలసతి మేల్కాంచి ... యప్రాంగణభూ
తలమునఁ గి...గానకమ..., ...ముందు దుర్వారాకృతులై.

ఆ. పెఱడు నిరుగు పొరుగు మఱి వాడవాడలు
పురము బయలు వెదకి సరవిఁ బందిఁ
గనక ముసలి జంగమయ్య గైకొనిపోవ
వలయు నింత నిక్కువంబు దలఁప. 62

తే. ఎత్తుఁడని వచ్చి యెంతటి కెత్తుకొనియె
బడుగుజంగము కూళుఁడు కుడుచునింటి
కెగ్గు చేసిన దుష్కర్మి కేటిగతియొ
యనుచుఁ జింతించి యటఁ గొన్ని దినము లరుగ. 63

క. శరవికసనంబు నిర్మల, శరసరసీభాస్వదబ్జసముదయమగు నా
శరదాగమమున మాధవ, శరదేవ్యర్చాదినములు చనుదే నంతన్.

క. నిండినవేడుక ధరణీ, మండలపతి చండికకు సమర్పణసేయన్
బందుగ వేటలు వేగొని, తెండని తలవరులఁ బంప దృఢగతివారల్.

చ. పురిఁ గలచోటులన్ వెదకి పూర్వ మొసంగెడిచోట్ల మేష కా
సర కిటి తామ్రచూడములఁ జయ్యనఁ గైకొని యంత పుండ్రపా
మరుఁ గని యోరి పామర! యుమాసతి పండువు గాన నీదుమం
దిరమున నిచ్చవచ్చు కిటిఁ దెమ్ము రయమ్మన నాతఁ డయ్యెడన్. 66

క. మందిరమున వసియించెడి, పంది యెటకొ తప్పె చని యెఁబండువకీక నే
చందమునఁ దెత్తునని డోలాందోళనచిత్తుఁడగుచు నతఁడుండుతఱిన్.

చ. వనజశిలీముఖాంతకనివాసమునన్ వసియించె సూకరం
బని యొకరుండు దెల్పిన రయంబున నచ్చటి కేగి దాని బం
ధన మొనరించి తెచ్చి నరనాథుని సన్నిధి [illegible] దాఁ
జనినతదీయపోత్రిఁ గని సమ్మద మొందె మహీశుఁ డంతటన్. 68

క. ఎవ్వరు గొట్టఁగఁ జనఁ దీ, క్రొవ్వినకిటి బట్టి నేన కొట్టెద నని చే
రివ్వాన నసిగొని వ్రేసిన, యవ్వరఖడ్గంబు భర్మమై కనుపట్టెన్. 69

మ. నరనాథుం డతివిస్మయాస్వితమనోనాళీకుఁడై [illegible] త్రి శే
ఖరు భావించి విచిత్ర మయ్యెడుఁ గిటిం గన్గొమ్మ ఖడ్గంబు బం
గరువై కన్పడె దీని పోఁకి యిటు లోకంబందునం గంటిమే
కిరిమాత్రం బని చూడరా దనుచు లెక్కింపంగ నమ్మంత్రియున్. 70

క. అరుపందిదేశమున నిజ, పురమునఁ గలయినుము దెచ్చిపోత్రివరకళే

బరముదగిల్చినఁ జామీ, కరమై యొకపర్వతంబుకై వడి నుండెన్.

వ. అంతటఁ దద్బ్రాహ్మణవరాహం బాత్మశరీరంబు వీడుకొని గంధర్వుండై తత్సమయాగతభర్మరత్నాంచితదివ్యవిమానం బధిరోహించి జంగమ ప్రసాదోపభోగంబునం జేసి శాపమోచనం బందితి సుఖి నైతి నని సంతసింపుచు శివపురి కరిగెఁ దత్కోలాంగం బతివిమలశాతకుంభంబై వెలుంగుచుండె నంతయుం గని రాజపురందరుండు విస్మయం బంది యమ్మాటవికు రావించి నీ కీ వరాహం బెట్లు దొరికె నని యడిగిన వాఁ డిట్లనియె. 72

సీ. నరనాథ! విను మొకనాఁడు మాగృహమున
కెచ్చోటనుండియో యేగుదెంచి
గంజికడుగు ద్రావి కపలక యున్నంతఁ
గొంత కాలమునకుఁ గుధరభక్తి
భజియింపఁ బోవుచు బడుగుజంగముఁ డొకఁ
డద్దమరేయి మాయాలయమున
కశనార్థియై చేర నతని కించుక చోడె
సున్ని పెట్టిన నది చొరక కొంత

తే. డించి చన నది యిక్కిటి గాంచి నమలె
నదియ మొక పిల్లు వెడలి శివాంగణమున
నున్న యాజాడఁ దెలిసి నేఁ డుత్సవమున
కీశ్వరికిఁ బ్రీతిగాఁ దెచ్చి తిటకు ననుడు. 73

పంచచామరము. రసాతలాధినాథుఁ డబ్బురంబు నొంది జంగమ
ప్రసాదసన్మహత్త్వ మెంచుఁ బంకజాతసూతికిన్
వసంబె యంచు సన్నుతించి వస్త్రభూషణాదివ
స్తుసంతతిన్ ముదం బొనర్చి తోలెఁ బెంచు నంతటన్. 74

వ. ఇట్లయ్యానసీశ్వరుచేత బహుమానాన్వితుం డై శూరాన్వయభూషణుం డాత్మగతంబున నిప్పాదిలసం గాకె రాజుమె ప్పంది లెక్క లేనిధనంపుఁగుప్పఁ దిలకింపఁగంటి మత్పూర్వజన్మసుకృతఫలం బివ్వరాహరూపంబై వచ్చి నాయింటఁ గష్టంబున కోర్చియుండి యంతంబున నన్నింతభాగ్యవంతునిఁ జేసి యియ్యానంతాకాంతునకు సంత

సం బొనగూర్చి తనువు వీడ్కొని చనియెం గాని కేవలసూకరంబు
గాదని ప్రమోదంబు నొందుచు నిజగృహంబున కరుగునవసరంబున.

చ. సిరిమలతేనిఁ గాంచి నిజసీమకుఁ గ్రమ్మఱఁ బోవునట్టియా
శరణునిరథ్యఁ గన్గొని ససంభ్రముఁడై శబరుండు వచ్చి భూ
వరునకు మ్రొక్కి నాఁటిగణసర్యఁ డిదే చనుదెంచె నన్న సు
స్థిరతరసమ్మదాంబుధిఁ దేలి మహీతలనాథుఁ డయ్యెడన్. 76

శా. ధీరామాత్యులఁ బంచి జంగమునిఁ దోడ్తెప్పించి మాణిక్యపీ
ఠారూఢుం దగఁ జేసి యర్ఘ్యమును బాద్యం బిచ్చి శర్వాన్నమ
స్కారవారితము సన్నుతుల్ సలిపి లోకస్తుత్యా! ప్రాంచత్కృపన్
మీ రిచ్చోటికి వచ్చుటన్ మిగుల నెమ్మిం జెందె మాభాగ్యముల్.

శా. స్వామీ! తావకభుక్తశేషము భుజించం గల్గి కోలం బయ
స్సామగ్రిం గనకం బొనర్చి పసపన్ సదాభ్రపగంధర్వుఁడై
హేమస్ఫారవిమాన మెక్కి సురమానీశాదు లగ్గింపఁగా
సోమార్ధాంకితజూటువీటి కరిగెన్ జోద్యంబు రెట్టింపఁగన్. 78

ఉ. కావున నీమహామహిమ గన్గొన శక్యమె యంచు నెంచున
బ్భాసురవాక్యముల్ వినయపూర్వకయాదర ముప్పతిల్లఁగా
భావజవైరితుల్యుఁ డగుభక్తవరేణ్యుఁడు పల్కె నోర నీ
భావము గాననయ్యెఁ గుణపావనమూర్తివి రాజశేఖరా! 79

క. భువి జంగమప్రసాదము, భవరోగౌషధము గానఁ బార్థివ! నీ కే
వివరింతుఁ దన్మహత్త్వము, ప్రవిమలమతివినుమటంచుఁ బలుకఁదొడం
[గెన్.

చ. కలఁ డొకభక్తుఁ డబ్జశరఘస్మరపాదపయోజషట్పదుం
డలఘుతరప్రభావుఁ డతఁ డక్కడ నక్కడ శైవమందిరం
బులఁ దగుభిక్ష మెత్తి జలపూర్ణతటాకసమీపధారుణీ
తలమునఁ జేరి యచ్చట సుధాకరశేఖరుపూజ సల్పుచున్. 81

తే. తత్ప్రసాదంబు భోజనాంతరమునందు
నుంచి లింగార్పితంబు గావించి యార
గించి యాభాజనం బట్టు కెడతటాక
జలములో వైచి చరమూర్తి చనినయంత. 82

వ. అట్లు నీటన్ వైచినతరియం దొక్కకణం బుండి రాలిన. 83

చ. అతులితపూర్వజన్మసుకృతాతిశయంబునఁ దజ్జలాంతర
స్థితశరణప్రసాద మతితీవ్రత నొక్కఝషంబు మ్రింగి వ
ర్ణితసువర్ణాంగమై యట చరించుచు నుండినకొన్ని నాళ్ల క
ద్భుతముగఁ జెంచొకం డడవి దూరపువేఁటల కేగి వచ్చుచోన్. 84

క. చెలువుననీరముఁగనుఁగొని,తలఁచుచుఁగడు విచటమీలుతథ్యమనుచున
య్యెలుకపుడుసంతసంబున, మెఱయుచు వలవైచితిగిచె మత్స్యవతో [డన్.

తే. జాలమునఁ జిక్కివచ్చిన మీలతోడ
సత్ప్రసాదోపభోగి ఝషంబు దగులఁ
గాంచి సంతసమున మెయి పెంచి చెంచు
చిక్కమున వైచికొని గృహసీమ కరిగి. 86

చ. తనసతిఁ జేరఁ బిల్చి వనితా! యిది చూచితె మంచిచాయమీ
న్గొని చనుదెంచినాఁడ యిది గొబ్బునఁ గూరఁగవండి తెమ్ము నీ
వనవుడు నట్ల చేసి యది యన్నము రెట్టిగఁ దట్టఁ బెట్టినం
దినె శబరాన్వయోద్భవుఁడు తేపకుఁ దద్రుచు లుగ్గడింపుచున్. 87

చ. అది మొద లా కిరాతపతి యంపఱు మేలన హింస సేయుటల్
వదలి గిరీశ్వరాంఘ్రులు దలంచుచు నెమ్మది నుండ సంతఁ గొ
న్ని దినము లేగ భీకరవనీకిటి యొక్కటి పక్కణంబులో
మసమునఁ జొచ్చి యందుఁ గల మానవులం గలగుండు సేయుచున్.

క. చనుదెంచి యాశబరుఁ గ,న్గొని వడి దంష్ట్రావిటంకకోటినిఁ బడఁ జి
మ్మినవిగతప్రాణుఁడై య, య్యనఘుఁడు భువినొరఁగె వజ్రహతగిరివోలెన్.

ఉ. వానిఁ బరేతరాజభటవర్గము నారకబాధఁ జేయఁగాఁ
బూని కఠోరచర్యఁ గొనిపోవఁగ వచ్చిన నీశుదూత లో
హో నిలువుం డితండు మహిమోన్నతజంగమసత్ప్రసాదభు
జ్మైనచరప్రభావమున మేలగుపుణ్యశరీరి గావునన్. 90

చ. యమనిలయంబుఁ జేరఁగ నసర్హుఁడు పొందని కల్పభూజసూ
నమయవిమాన మాతని మనఃప్రమదంబున నెక్కఁబంచి ది
వ్యమునులు సన్నుతింపఁ బ్రమథాధిపలోకముఁ జేర్చ నాతఁ డం
దమితసుఖానుభూతిఁ గని యంచితలీల వసించెఁ గావునన్. 91

క. శరణప్రసాదమహిమము
ధరణీశ్వర! యిట్టిదని ముదం బిగురొత్తన్
జరమూర్తి తన్మహత్త్వము
దిరముగఁ దెలుపుటయు పసుమతీపతి యంతన్. 92

ఉ. క్రమ్మఱ మ్రొక్కి యోశరణరత్నమ! జంగమసత్ప్రసాదసా
ఖ్య మ్మొనగూర్చి నన్ విమలకాయునిఁ జేయు మటన్న మంరహా
స మ్మిగురొత్త నిట్లనియె శాంకరవంశసుధాబ్ధిరాజ! నీ
కెమ్మెయిఁ దద్విభూతి ధరణీశ్వర! కల్గఁగ నేర్చు? చెప్పుమా!. 93

తే. భస్మరుద్రాక్షధారియై పంచవర్ణ
మంత్రపఠనం బొనర్చుచు మహితనిష్ఠ
లింగమును దాల్చి గురుభక్తిసంగుఁ డైనఁ
గాక దివ్యప్రసాదంబు గలుగు టెట్లు?. 94

చ. అనుడు మహీశుఁ డిట్లనియె నయ్య! తదీయమహత్త్వముల్ క్రమం
బున నెఱిఁగింపు నావుడు విభూతిమహామహిమంబు దెల్పెదన్
వినుము వసుంధరారమణ! నిశ్చలచిత్తముతోడ నంచు న
య్యనఘుఁడు చెప్పఁగాఁ దొడఁగె నాత్మ దయారస ముప్పతిల్లఁగన్.

విభూతిమహిమ.

సీ. ఉదుగ్రజధరపశ్చిమోత్తరదక్షిణ
పూర్వాభిముఖములఁ బుట్టెఁ బంగ
ళాసితధవళధూమ్రారుణవర్ణంబు
లను నందభద్రసురభిసుశీల
సుమనస యన్నామభేదములఁ గోవులు వాని
వలన విభూతియు భసితభస్మ
మును క్షారరక్షలు జనియించె నబ్భూతి
గావించు నట్టిమార్గములు నాల్గు

తే. గలవు కల్పానుకల్పోపకల్పములను
గల్పమును నన నందులోఁ గల్పభూతి
యుత్తమం బది దొరకక యుండెనేని
తక్కినవి మూఁడుఁ జేయంగఁ దగు మహీశ!. 96

సీ. క్షితి విభూతి యొనర్చుగతి విను ముత్తమం
బగు గోమయము భూమిం నంటనీక
యంభోజపత్త్రంబునందు సద్యోజాత
వరమంత్రమునబట్టి వామదేవ
మునఁ బిండములు సేయుచును దత్పురుషమున
నారంగ నిడుచు నఘోరమున శి
వాగ్నిలో దఱికొల్ప నది; కల్ప మడవి నెం
డినగోమయముఁబొడి మునుపు చెప్ప
తే. కరణిఁ గాల్చిన నది యనుకల్ప మయ్యెఁ;
దానె కాలినభూతి వస్త్రమున ధూళి
తంబుగాఁ జేసి గోమూత్రమునఁ జేయు
కరుడు గాల్చిన నదియు సంకల్ప మయ్యె. 97

వ. ఇట్లుగాక తక్కినయది యకల్పంబని యెఱింగి యేతద్విభూతి కాలాగ్నిరుద్రోపనిషదాదిశ్రుత్యంతోక్తమార్గంబున సతతంబు నుత్తమాంగప్రముఖాంగంబులం ద్రిపుండ్రధారణం బొనర్చునది. 98

క. ఇట్టివిభూతి ధరించిన, యట్టిమహామహుఁడుజగతినవయవయుతుఁడౌ
గట్టువిలుతుండె యగు నె, వ్వట్టున సంశయము లేదు పార్థివతిలకా!.

సీ. శ్రీకర మోక్షలక్ష్మీకటాక్షకృత్యాంకితతిలకవిఖ్యాతి భూతి
యత్యంతఘోరమహాపాతకౌఘమహీధరమదనసేకాంతి భూతి
కాకోదరాంకకంకణసర్వశరీరవిలేపనప్రీతి భూతి
ఫాలతలాంభోజభవపూర్వవిలిఖితపాతకాక్షరతమోజ్యోతి భూతి
తే. సంతతాత్మీయమాననసౌఖ్యశక్తి, భాసనాథాభిమానవిభ్రాజితసురూప
మైమహిమముష్మికైహికసౌఖ్యప్రభావ, స్ఫూర్తికిరవైన భూతియే భూతి భూతి.

వ. ఇవ్విభూతిమహత్త్వంబున నొక్కకుక్కుటంబు రుద్రుండెట్లయ్యె నొక్కపావురాయి యత్యంతరోగబాధితుం డై యుండేనిం జనిచని ప్రాణాంతసమయంబున నొక్కపట్టణబాహ్యాంతరదేశశ్మశానవాటికా సమీపంబునఁ గంజాలకే పడియున్న నొక్కపావురమేయుం బచ్చుటశ్మశానభస్మసంగతపావురయై వచ్చి యప్పావురంబు ద్రొక్కి చనినఁగొంతకాలకతండు మృతిఁ జెందిన కింకరు లతనిం గొనిచను

వైవస్వతాంతికంబున నిల్పినకృతాంతుం డతనిప్రాణాంతసమయంబునం
దైనభస్మధారణమహత్త్వంబువలనం గల్మషంబులుఁదొలంగి పుణ్యా
త్ముం డయ్యె నితండు మదీయదండనంబున కనర్హుం డనిన బహుమా
నంబుగా నతని శివలోకంబున కనిచెం గావున భస్మధారణమాహా
త్మ్యం బిట్టిదని మఱియు ని ట్లనియె. 101

మ. ఒకచో దేవుఁడు ఘోరపాపకరుఁడై యుండంగఁ దద్బాంధవ
ప్రకరం బాతనిదుష్కృతంబులు సహింపన్ లేక వెల్వెట్టినన్
సకలంబున్ విడిపోయి ఘోరవిపినస్థానంబునన్ బల్కురా
తకదేశంబునఁ జేరి యందు నతిఖేదం బంది వర్తింపఁగన్. 102

తే. అతఁడు ఘోరాఘమహిమంద యనుభవింప
వలయు ననుమాట జనులకుఁ దెలియునట్టు
లమ్మహీసురదేహంబునందుఁ గుష్ఠ
రోగము జనించె నొరులకు రోఁత దనర. 103

తే. ఒడలు చూచిన జను లెల్ల నోకిలింప
గాలిచే దూరమునకు దుర్గంధ మొదవ
నడు గిడఁగ శక్తి యించు కంతైన లేక
పట్టుదెగిపడు మేనుచేఁ బాఱుఁ డుండి. 104

క. ఒకనాఁ డా కటఁ బడ నోపక తత్పక్కణసమీపవనిఁ దిరుగుచు నం
తకమున్న దవానలదగ్ధకుజామితభస్మ మచట గనుఁగొనియందున్.

తే. మండి చల్లాఱినట్టిగోమయపుఁగరడు
గాంచి యాఁకట డస్సినకతన వేగఁ
బుచ్చుకొని తిని యబ్బాదిప్రోవునందుఁ
బడియె నడుపంగ లేక యాబ్రాహ్మణుండు. 106

చ. అటు పడియున్నతీవ్రగహనానలదగ్ధమహీజలోష్మతన్
బటపట మేను వ్రక్కలయి పాఱునిదేహము వీడ నత్తఱిన్
గుటిలభయంకరాకృతులు ఘోరగదాయుధపాణులై సము
ద్భటగతి వచ్చి కింకరులు దట్టుచు వే గొనిపోయి యాతనిన్. 107

ఉ. కాలునిమ్రోల నిల్ప నతికంపితదేహముతోడ దూతలన్
దూలఁగఁ బల్కి యాతఁ డతిదుష్టవిచేష్టితుఁ డైననేనియుం

ఉ. అ త్తరిలేచి బిజ్జలధరాధిపుఁ డంగముకంపమొంద న
త్యు త్తముఁడైన దేవరసు నొయ్యనఁ జేరి నమస్కరింపుచు
న్మత్తుఁడ క్రోధచిత్తుఁడ క్షమాగుణహీనుఁడ నైననాకు నీ
వి త్తరికూర్మిచే నభయమీయఁగదే శరణాగతావనా!. 182

సీ. భీరహితపురాము రారివీరానీక మారకుండగు నాగహారిరూపు
ఘోరపరాక్రమ తారకదైత్య సంహారుఁడైనట్టి కుమారురూపుఁ
బారమేశ్వరభక్తిదూరదక్షవినాశ కారుఁడౌ వీరావతారురూపు
నీరేజభవశిరో దారణుండగు కాల భైరవమూర్త్యాఖ్య హారురూపుఁ

తే. బోలు నీరూపు శమియించి పూర్వసరణిఁ
దనరి జనలోచనానంద మొనరఁ జేయు
మని నుతించిన నెప్పటితనువుఁ దాల్చె
బసవముఖభక్తతతికి సంతసమెలర్ప. 183

క. వరగుణుఁడగు బెట్టిదదే, వరసు చరిత్రంబు వినినఁ బఠియించిన యా
నరుఁ డరితరిఁ బోరిగొని సు, స్థిరతరశుభసంతతులను జేకొనుధరణిన్.

క. కావున ఘనుఁడీ బెట్టిద, దేవరసయమహిమలిట్టి తెఱఁగగు మఱియుం
భూవిదితంబుగఁ జిత్రము, పావనగుణవీరభద్ర పార్థివ వినుమా.

క. కలిదుర్వ్యాపారహితుఁడు, సలలితజంగమపదాబ్జజాతామిళితుం
డలఘుతరకీర్తియుతుఁడీ, గిలకదమారయ్యయితనికృత మెఱిగింతున్.

## గిలకదమారయ్య కథ.

సీ. తనువునభస్మలేపనమొప్ప నొనరించి గండపెండెరమొక్క కాలిడాల్చి
కరకచల్లాణంబు కాసెతో బిగియించి, కటికంపుపోగు లేప్పడధరించి
గళమునపాలకాయలసంకుసరులేసి ఘనమైన మేనయోగములువొడగి
ఫాలభాగమునందుఁబ్రాణలింగముసిల్పిపసిమిమీరెడుశాల్వపైనిగప్పి

తే. కన్నొనల కజ్జలముదిద్ది కావిబొట్టు
ఫలకమునఁ బెట్టి నాభితలమున ఘంట
నునిచి యొకకేల గిలకయు నొక్కకేల
బొమ్మయును బట్టి కళ్యాణపురమునందు. 187

ఉ. వంచన యేమిలేక గణవర్యగృహంబుల కేగి గిల్కవా
యించుచుఁ గేలిబొమ్మ నటియింపఁగఁ జేయఁగఁ జూచి వారు మ

న్నించి యొసంగు కాంచనమణిప్రచయాంబరవస్తుజాలముల్
కోం చరుదెంచి భక్తవరకోటిసమర్చ లొనర్చుచుండెడిన్. 188
తే. ఆవిధము జనులంతట నాడుకొనఁగ
విని గణాచారి సంగయ్య యనెడు భక్త
పుంగవుఁడు తీవ్రకోపవిస్ఫూర్తితోడ
మారయాఖ్యునిబిలిపించి మూలిపలికె. 189
ఉ. మాయలబొమ్మ పట్టి పలుమారు నటింపఁగఁజేసి దాన నా
దాయముగూర్చి శైవగణతండసమర్చ లొనర్చుచున్న లే
దాయనె వేఱెయొక్కసనయంబగు కాయక మిట్లు సేతయే
నాయము మానసూనదగు నాధరణీస్థలి భక్తకోటికిన్. 190
క. మేదిని శరణులు లింగవి, నోదంబులు నితరమగు వినోదానుభవం
బేదిక్కున నొనరించిరి, నీదగు చరితంబుదలఁప నింద్యం బయ్యెన్.
తే. కుండచరపుర కుమ్మరగుండవిభుఁడు
చప్పటలు వేసి చారమచక్రవర్తి
హరుని నాడించి రాగతి యవలఁబుచ్చి
మాయచేఁబట్టి యాడింప నాయమగునె. 192
చ అనవు డతండు మ్రొక్కి వినయంబున నిట్లను సంగమేశ! నీ
యనుమతి యట్లుగాఁగ ననయంబుఁ జరించెదఁ బొమ్మ యింకఁ జే
కొన నని పల్కి గేహమునకుం జని యెప్పటిరీతి కాయకం
బునకయి యొక్క మేటిగణపుంగవునింటికిఁబోయి యచ్చటన్. 193
చ. అలరకరస్థలింగమపు డాత్మకరంబున నిల్పి వింతగాఁ
గిలగిలనాగ గిల్క యొకకేలఁ గదల్పఁగ హస్తపద్మసం
కలితభవుండు షట్పదముకై వడి గంతులు వేయఁజొచ్చె వి
చ్చలవిడి చూచువారు మది సంతసమందఁగ నంతలోపలన్. 184
ఉ. శైవగళోత్తమాంగకరసారసకక్షముఖాంగదేశయు
క్పావనలింగముల్ ప్రథితకాంచనపీఠనియుక్తలింగముల్
స్థావరలింగముల్ గదలి తాండవమాగతినాడఁజొచ్చినం
భావములందు నద్భుతము పర్వఁగ భక్తవరేణ్యు లొండొరుల్.
తే. మేటికలలోన వస్త్రంబు మూటలందు

కరతలంబున నున్నలింగములు గంతు
లేయఁగాఁజొచ్చె యిది యేమి మాయమొక్కో?
యనుచు నందఱు బసవాలయమున కరిగి. 196

ఉ. ఆతనిఁగాంచి తన్నటనమంతయుఁ దెల్ప స్వలింగమూర్తి ము
న్నాతెఱఁగొటఁజిత్తమున నద్భుతమందగ శంకరద్విజ
వ్రాతము పూర్వశైవనికరంబులు స్థావరపీఠలింగసం
ఘాతము నాట్యమట్లనె భయం బెదనొందఁగ వచ్చిచెప్పినన్. 197

మ. పరిశీలింత మటంచు నున్నయెడ నొప్పం బట్టణోదంతముల్
నిరతంబు న్వినుపించుచారుఁ డొకఁ డొలిన్వచ్చి సేవించి యో
వరమంత్రీశ్వర! యిప్పురాంతరమున న్వాక్రువ్వఁగా రాని చి
త్రరసంబొక్కటిఁ గాంచివచ్చితిని దథ్యంబెట్లనన్ దెల్పెదన్. 198

వ. గిల్కదమారయాఖ్యుం డొక్కభక్తసత్తముండు. 199

తే. బొమ్మనాడించి తల్లడ్డి పూటపూట
నయ్యలనుబూన్ప సంగయ్య యనెడిభక్తుఁ
డీసరణిగూడదన బొమ్మ నెడమకేల
లింగమూర్తి నాడించె భక్తాంగణముల. 200

తే. మాదఁ డింతటి భక్తుఁడో? మదనవైరి
తనకుఁ దా నాట్యమాడె నాతండు చెప్ప
నటుల నీచిత్ర మెచ్చుటనైన గంట
మే! యనిన దండనాథుండు మెచ్చి యపుడు. 201

క. వారందఱితో సంగయ, గారి శుభాగారమునకుఁ గ్రక్కున జని జో
హారుతగలింగనర్తన, కారణమునఁ జోద్యమంద ఘనపదములకున్.

క. జోహారుసేయ నాతం, డాహా! యిది యేమి వింత! యధికులు మీ రి
ట్లూహింతురె? యని క్రమ్మఱ, నాహారభక్తార్యవితతియడుగులకొరగెన్.

వ. తదనంతరంబ. 204

చ. బసవఁడు సంగమేశుఁ గని పల్కెను గిల్కదమారశూరి కి
వసదృశబోధసల్ప మము నందఱు నిత్తఱి లింగమూర్తిచేఁ
బసచెడి మోదచేసితివి బాపురె యాతనిచర్య లెన్నఁగా
బిసరుహగర్భశేషగిరిభిద్గురుముఖ్యుల కైనశక్యమే. 205

ఉ. మాయగ బొమ్మచేసి గణమండలియిండ్లకు కోతికై వడిఁ
బాయక త్రిప్పి వారి పదపంకజములు ల్గొలువంగఁజేసె న
య్యాయతశౌర్యుఁ డిట్టిగతి యర్హము గాదని మాన్పఁజెల్లునే
ధీయుత! యింకనైనఁ దొలితీరున వానిఁ జరింపఁజేయవే. 206

చ. అనవుడు లజ్జనొంది బసవాధిప! నేరము చేసినాడ నీ
యనుపమ మర్మమే నెఱుఁగ నైతి నటంచు వచించి వేగ మా
రని బిలువంగఁ బంచి గణరత్నము తావకదివ్యలింగమూ
ర్తిని నటియింపఁజేయకుము దేశికవర్యుల యాజ్ఞ నీవనన్. 207

ఉ. ఓగురులార! తొంటిగతి యోగ్యము గాదని యంటి రిప్పుడీ
లాగున గూడదంటిరి కళాధరభూషణ భక్తపూజ లే
లాగున నింకఁజేయుదు తలంపఁగ కాలము మించెఁ జొచ్చె నా
కేగతి యానతిచ్చెదరొ యిండని మారని గాంచి నవ్వుచున్. 208

క. సంగయతో బసవసచివ,పుంగవుఁడును నితనికొక్క బుద్ధి దెలుపుఁ డీ
జంగమగురులింగార్చన,భంగము గాకుండనని భయకంపితుఁడై. 209

చ. గిలకదమార! తొంటిదగు కృత్యముఁజేకొని పొమ్మటన్న న
ప్పలుకుఁ దలంధరించి యటవారలకుం బ్రణమిల్లి యెప్పట
ట్టుల బొమఁగొంచు వేచనెఁ గడున్ముదమందుచు నైజవృత్తి కీ
యలఘుఁడు వీరభద్రవసుధాధిప యన్న దరంబె యీతనిన్. 210

వ. తదనంతరంబ సకలశివలింగంబు లీనర్తనంబు మానుటయు బసవేశ్వ
రాద్యఖిలభక్తపుంగవు లీతనిమాహాత్మ్యంబు గొనియాడుచు నిజని
వాసంబుల కరిగి రట్లు గావున. 211

క. అలఘుతరభక్తియుతుఁడగు, గిలకద మారన్న మహిమ: గీర్తించిన ని
శ్చలమతివినినన్నాయం,దొలఁగుఁ గసద్గురుకృపాయుతుఁడగునరుఁడిలన్.

ఈయురు లింగపెద్దయ్య కథ.

వ. అదియునుంగాక. 213

ఉ. ఈయురులింగపెద్ది కథ మేమని చెప్పఁగ వచ్చు దేశికేం
ద్రాయతసత్కృపాగతి శివాధిపమంత్రకళారహస్య బో
ధాయుతుఁ డాశ్రితావనవిధానవిచక్షణుఁ డిష్టలింగపూ

జాయనసత్ప్రవర్తి సుకృతాత్ముఁడు సూనృతవాక్యుఁ డిమ్మహిన్. 214
ఉ. ఈతఁడు మోగులూరఁ జరియింపుచుఁ దా నొకనాఁడు పుష్కరో
ద్భూతమరందపానపటుతుందిలషట్పదమేచకప్రభా
కైతవకందదర్శనవికస్వరహృచ్ఛిఖిభాసితప్రభూ
జాతకుడుంగమానసరసీ సైకతదేశమునందు నొక్కచోన్. 215
తే. కలితపద్మాసనస్థుఁడై కనులుమూసి
జపమొనర్చెడి జంగమ సార్వభౌము
ధీరు నురులింగ మనియెడు దివ్యపురుషుఁ
గాంచి యల్లంతనుండి జాఁగఁబడి మ్రొక్కి. 216
చ. నిలచిన కొంతసేపటికి నీలగళాపరమూర్తియైన య
య్యనఘుఁడు మౌనవృత్తి నిడి యక్షులువిప్పి కనంగనంతలో
పలఁ దిరుగంగ మ్రొక్కి వెలివాఁడ మనుష్యుఁడ పెద్దయాఖ్యుఁడన్
ఖలుఁడను నన్ను శిష్యునిగఁ గైకొని వేగ కృతార్థుఁ జేయవే!. 217
క. జననియుజనకుఁడు దాతయు,ఘనదైవముగురుఁడునీవగతియును నీవే
యనినమ్మి నిన్నుఁ జేరితి, ననుఁ గరుణాదృష్టిఁగనుము నతజనపాలా!2:8
చ. అనవు డతండు నెనర్పు వినయంబున కెంతయు బ్రీతిజాగి హీ
నున కెటులియ్యగాఁదగు మను ప్రభులింగము నన్నగొంకులోఁ
బెనఁగొన కొంతసేపతనిఁ జేర్కొనకూరకయుండి వానితో
నినుమును నెన్న దేనెఱుఁగ నీగుణమెట్టిదొ యేడనుందువో? 219
వ. అనిన నతం డిట్లనియె. 220
క. ఇప్పుడి నెప్పుడు యుండుదు, చెప్పంబడి యేమి కరుణఁజేపట్టిన మీ
కప్పుడె నాగుణము సఫలమ,నప్పు మనిజాగి మ్రొక్కియతఁడిట్లనియెన్.
క. గురుశుశ్రూషయొనర్చుచుఁ, జిరకాలంబునకుఁ గాక చేకూరునె నీ
యుపదేశ మనిన నెఱితియే,నృజచినన దేసేయువాఁడ పావనచరితా!
తే. అనిన దాన్నవకార్షంబు లధికభక్తి
భూతిరుద్రాక్షధారుఁడై భూతనాథ
భక్తు లెవ్వరైన నెంచ్చుచుఁ బరిచరింపు
మనిన నట్లగాక! యనిపోయి యనుదినంబు. 223
క. ఉరులింగము బోధించిన, కరణిన్ గ్రుమ్మరుచు వంటగట్టియ లొక మో

పరుడున వారల గేహావరణములో బయలనుండి వైచుచునుండెన్.
ఉ. ఈగతి మూఁడునాలుగయిదేడులు వృచ్చి యితండు వేడ్కచే
నాగురువర్యుభవ్యకరుణాగతిచే ఫలియించు నంచు వే
వేగ ప్రభాతవేళ నిలు వెల్వడి నాఁటికినంబునందు స
ర్వాగమవేది యాగురునియంగణమందుఁ జరించుచుండఁగన్. 225
ఉ. నిద్దుర లేచి యాఘనుఁడు నీలగళుఁ స్మరియించువేళ నా
పెద్దయ సంచరించుసడి నీనుల సోఁకిన నావుదూడయో
యెద్దొ యటంచుఁ వాశియని యే త్తర ముష్మరుఁబల్క నాతఁ డీ
ప్రొద్దునకబ్బె నాకు గురుబోధితమంత్ర మటంచు నాత్మలోన్. 226
తే. కంటిభాగ్యంబుభక్తినిగంటిఁగీర్తిఁ,గంటిఁబెన్నిధిగంటిమోక్షంబుగంటిఁ
గంటి జ్ఞానంబునింకనేఁగడమలేక, యుంటిని త్తతినీగురుమహిమవలన.
చ. అని యిటుల న్నుతించుసమయంబునఁ సద్గురుఁ డేగుదేర నా
తని కతిభక్తి మ్రొక్కి యమృతప్రదమంత్రరహస్య మబ్బె మీ
ఘనకృప నంచు బల్కిన మొగంబున నివ్వెఱ దోఁప వాశి యం
చని మును తాను దల్చుమహిమాత్ముగము ల్మను వయ్యె వీనికిన్.228
చ. పలుమరుఁ బల్క మంత్రమయి పాటిలె నౌర ! తదక్షరద్వయం
బిల సితదర్పుఁడౌ కతన నీశ్వరుఁ డీగతి సంఘటించె నం
చలమినప్రేమఁ బెద్దయ! కృతార్థుఁడవైతివి పొమ్మటన్నఁ జాఁ
గిలిపడి మ్రొక్కి యేగె వడి గేగుచు బొంగుచు గంతు లేయుచున్.
క. ఆరీతి నరిగి సద్గురు, భూరికృప న్మంత్రసిద్ధిఁ బొందినవాఁడై
ధారుణి జానెందెత్తున, ధీరుఁడు పెద్దయ్య మెఱసి తిరుగుచునుండెన్
ఉ. అంతటఁ దత్పురాధిపతి యాత్మమునందంబున నొక్కబావి ద్ర
వ్వింత మటంచు నుప్పరులఁ బిల్వఁగఁబంచి యనుజ్ఞయీయ వా
రెంతయుఁ ద్రవ్వినన్ జలము లేమియు నూరక చట్టు వడ్డ దాఁ
జింతిలి రాయి దొల్చు ఘనశిల్పికులన్ నియమింప వారలున్. 231
తే. చేతనయినంత మాచట్టు చెండి చెండి, యించుకైనను దానిభేదించలేక
విసివిభూపతికాగతివిన్నవింప,మదిని వేఁగొంచు దోఁచనమంత్రిఁజూచి.
క. నీ కేమిఁ దోఁచు నాశిల, యేకైవడిఁ బెగు జలంబు లేగతి నూరన్
మా కేమి తెలియకున్నది,యాకూపము పనికివచ్చునను పుం జెపుమా.

ఉ. నావు డతండు మ్రొక్కి నరనాయక! యొక్కటి దోఁచె నామదిం
బావకపట్టణాంతరమున న్వసియించుమహాజనంబు లీ
బావి జనించు పట్టుపయిఁ బాదము లుంచిర యేని దీనిలోఁ
బావనసీర మూరు నిది భావ్యమ యేని యొనర్పు మీ వనన్. 234

ఉ. పెద్దల వారిఁ గన్గొని పురంబున నారసి సుప్రసిద్ధులౌ
పెద్దల నెల్ల నిచ్చటికిఁ బిల్వఁడు పొం డన వార లేగి యా
శుద్ధి యెఱుంగఁ జెప్ప విని చోటులనుండియు వారు వచ్చినన్
గద్దియ డిగ్గి మ్రొక్కి నరనాథుఁడు నద్భుతవారయుక్తుఁ డై. 235

ఉ. తవ్వినబావి డగ్గఱి బుధప్రకరంబున కర్థి మ్రొక్కి మీ
రివ్వల కూపమందు దిగి యిద్ధభవత్పదపద్మపాంసువుల్
నివ్వటిలంగఁ ద్రొక్కుఁ డని లీలగ నీరము పుట్టు నన్న వా
రవ్విధి సల్పినన్ సలిలమందు జనింపమి రాజు ఖిన్నుఁ డై. 236

క. ఉన్న యెడఁ జారుఁ డొక్కరు, డన్నరపతిఁ గాంచి దేవ యంత్యజుఁ డొకరుం
డున్నాఁడు ధరకు జానెడు, మిన్న గ జరియుంచు పదము మెట్టఁడు భూమిన్.

ఆ. తన్మహత్త్వ మెన్నఁ దరముగా దేరికిఁ, గాన వానిచేత నానాయె మొ
వారిఁ దీనిలోన నూరఁ జేయఁగ నన్న, బిలువఁ బనిచె నృపతి పెద్దయాఖ్యు.

చ. పిలిచిన వేగ వచ్చి తన పెంపు గనంబడ భూమి కెత్తుగా
నిలిచినవానిఁ గాంచి ధరణీపతి యద్భుత మంది వీని చే
సలిలము నూరు చట్టరు నసంశయ మంచుఁ దలంచి నూతిలో
పలిశిల వీడఁ జేయుట యుపాయము దోఁచిన సేయుమీ యనన్. 239

ఆ. ఆతఁ డట్లు సేతు నది యెంతపని యని, గురుని పదములాత్మఁ గుదురుకొల్పి
వాశి యనినఁ బట్టు వదలి యాం చట్టు బి, ట్టొగని బయలు [illegible].

ఉ. వెం[illegible] తిన్న్యానీసు ప్రసవించినఁ గన్గొని [illegible]
న్నం[illegible] సంతసము నద్భుతము [illegible] నేడు ము
[illegible] కాక యున్న్యలనఁగా జన దిప్పు మహిస్సతంబ నే
పంట ఫలింపఁ జేసె వనపాయముగా నని గాంచి వానితోన్. 241

క. అద్దం[illegible], శుద్ధి యన న్వచ్చు నిన్న హో! గుణ[illegible]కా!
పెద్దలకుఁ బెద్దవైతివి, పెద్ద[illegible]! నీకు సా[illegible] పృథివిం [illegible]. 242

వ. అని సన్నుతించుసమయంబున. 243

సీ. ఇదియద్భుతం బని మదిగణించెడివారు పోఁడిమిచెడిచిన్నవోవువారు
నెవరితోఁజెప్పక యింట్లకేగుడువారు నొకరిచాటుననొకరుండువారు
తలవంచియేమియుఁబలుకకుండెడువారు వెచ్చనినిట్టూర్పులిచ్చువారు
కాలియంగుళులతో నేలరాచెడువారు వెతలచేనాత్మలవిసుగువారు
తే. నగుచు నందలిపెద్దలు వగచుచుండు
సమయమున వచ్చి యురులింగసద్గురుండు
తనకు మ్రొక్కిన శిష్యుని నెనరు దొలుక
గ్రుచ్చి కౌఁగిటఁ జేరిచి మెచ్చుఁదనర. 244
క. శైవాగమోక్తసరణి, న్బావనతరలింగమొసఁగ భక్తవరేణ్యా!
నీవే నేనే నేనే, నీవే యిద్దఱికి భేద మించుక గలదే? 245
క. జాతీశుఁడు బిళ్లముచే, ఖ్యాతిఁ గనినపగిది భక్తగణములలో నీ
చేతఁగడు వన్నె కెక్కితి, మాతంద్రీ! నీవు శిష్యమాత్రుఁడవగుదే?.
తే. అనఘ! నీమామ పూర్వమై యస్మదీయ
నామధేయంబు గలుగంగ నాకుఁ గోర్కె-
పెరిఁగెనటుగాన నురులింగ! పెద్దయాఖ్యఁ
దాల్చు మని పల్క నాతఁడు దాల్చి వెలసె. 247
క. ఉరులింగపెద్దినిర్మల, చరితము సద్భక్తి సభలఁ జదివిన వినినన్
గురుకారుణ్యంబున సుస్థిరవాంఛాఫలసమృద్ధిఁ జెందునరుఁడిలన్. 248

## ఈండ్రఁగ మారయ్య కథ.

వ. అదియునుంగాక. 249
క. వేంద్రపుఁగినుకరనాదు, త్తంత్రిపయింబొడమి వాని తలయిలగూలం
గండ్రించువేల్పుపగతుం, డీండ్రఁగమారయ్యయితని నెన్నఁగదరమే.
వ. ఇతండు కల్యాణపురంబుననుండుచు ననుదినంబున. 251
చ. మొలచుట్టు స్వాడిగోలుదాన నగుబల్మొలాపయిం గీతక
త్తులు నూలుకన్ ముసలంబు వామభుజమందున్ దాని కిర్వంకలన్
కలులొట్లుండిడ కట్లనిచ్చనపెటుం గం గొమ్ము కాల్పందమున్
దలకొంఁముడిగుడ్డయున్ దనరఁబాత్రితగికాలమం దెప్పుడున్. 252
క. నిజకాయకమునకై యం, గజరిపుపదపూజనములు గావించి మనో
బుజమలర నేగినుర దె,చ్చిజనులకమ్మియు ధనంబుఁ జేకొని యెలమిన్.

చ. తనయిలు సేరి వాఁడియడిదంబున నాత్మకరద్వయంబు ఖం
డన మొనరించి శర్వనికరంబులు మ్రొక్కఁగఁ దారకాద్రికిం
బనిచి భజించివచ్చి మునుపంటివిధంబున నంటకొన్న పా
వనశయవారిజాతముల భావగణార్చ లొనర్చు నిత్యమున్. 254
క. ఈరీతి వ్రతము సలుపుచు, మారయ నొకనాఁడు నగరమార్గంబున రా
ధారుణిపతి సభ కేగుచొ, దారిన బసవండుఁగాంచి దండ మొనర్చన్.
తే. మగుడ నతి యొనరించు నమ్మహితుఁ డేగు
పిదప బసవండు సభ కేగి వేగ మఱలి
తత్ప్రసాదేచ్ఛ మారనిధామమునకుఁ
జనియెను ముదమున మూఁడవజాముతఱిని. 256
క. చని సంపతులకు నంపన, మొనరింపఁగ నుల్కి వారు దండేశుని గ
న్గొనియట్లుగొల్లనలుపుచు, వినయంబుననిట్టు లనిరి వికసితముఖులై.
ఉ. పావన మయ్యె మాగృహము పాపము లెల్ల నణంగెఁ బుణ్యముల్
ప్రోవుగఁజేరె ముక్తిసతిఁబొందుటగూడె ఫలించెఁ గోరికల్
దేవరదార లిందు నరుదే నిఁక జా గొనరింప కీశ్వరా
ర్చనవిధి సల్పఁగా వలయు జంగమవర్యులతోడ నీ వనన్. [మ
ఆ. అట్లుగాక యనుచు నమ్మంత్రిశేఖరుం, డపు డెవారలిడినయమృతమయ
హాప్రసాదతృప్తుఁడై తదనుజ్ఞచే, నెలమి నిజగృహమున కేగె నంత.
క. కొండెవమాచయ ధరణీ, మండలపతిఁజేరి యింద్రమానినియింటం
బండారిగుడిచెననిబలు, కొండెముగా దెలుపనతఁడు కోపోద్ధతుఁడై.
క. అప్పుడె బసవామాత్యుని, రప్పించిటు సల్కె మొగము రాజగమికే
తప్పులు లేవనితలఁచితొ, చెప్పఁగవినరానిపనులు సేయందగునే? 261
మ. కలశీలంబులు నీటఁబుచ్చి విశుద్ధోక్తుల్ గాలిఁ బోఁజేసి పూ
ర్వులచర్య ల్విడనాడి శాస్త్రనియమంబుల్ ద్రోసి కల్లమ్మువా
రలయిండ్లం గుడుచుంగ నెంచితివె సర్వజ్ఞుండవే యైనఁ ద
త్కులముం జూడక నీవు మిన్నకయె కక్కుర్తిఁ బడం జెల్లునే! 262
ఉ. చేతులు గోసి యీశ్వరునిచెంతకు నిత్యముఁ బంచుచున్న వి
ఖ్యాతి గణించి తేమొ యది గారుడమా టెఱుఁగంగలేక నీ
వాతనిపెంపు మాకు ఘనమై కనుపట్టెద వన్న నవ్వి యా

భూతలనాథ! తన్మహిమ పొల్లుసనాడుట నీకుఁబాడియే.? 268
క. మారయ మదవిదళుని, మారయయనివినుతి కెక్కెమహి నెల్లెడనా
మారయమహిమౌన్నత్యము, నారయగాగలమెభూవరాధిపయనినన్.
ఉ. మాటల కేమి యీశ్వరసమానుఁడు వాఁ డనునంత నమ్ము న
న్నాటి యతండు ప్రత్యయముఁ జూపఁగ నోపినవాఁడయేని న
ప్పాటున సమ్మతింతు మని పల్కెన్ దద్బసవేశ్వరుండు మో
మోటము లేక వాని మహిమోన్నతఁ జూపెద రమ్ము భూవరా.?
క. అని పరివారముతో న, జ్జనపతిదోడుకొని వానిసదనంబునకుం
జనఁగనియాతఁడెదుర్కొని,వినయంబునమ్రొక్కిబసవవిభుఁడిట్లనియెన్.
చ. అకుటిలతావకవ్రతమహత్త్వముఁ జూచుట కిన్నరాధినా
యకుఁ డరుదెంచెఁ గావున రయంబున నీతనికోర్కె దీర్పవే
సకలజనాక్షిపర్వముగ శంకరతుల్య! యటన్న నాతఁ డిం
చుక మదిఁ గొంకు లేక దనసుందరి దానును భక్తినమ్రులై. 267
క. చెఱకులు నఱికినచాడ్పున, కఱుకుకఱుక్కనగనాత్మకరములునాల్గుం
దఱిఁగికొనునంతలోనన్, గరకంఠునిపురికిఁజనియె గగనతలమునన్;
చ. అటు చని పార్వతీశుల పదాంతికమందున వ్రాలె నయ్యెడం
బటుగతి సిద్ధరాముఁ డనుభక్తవరేణ్యుఁడు గాంచి వచ్చి మా
కిట నట నైనభూధరను తేశవివాదముఁ దెల్ప నేను వి
న్నటులను వీరభద్రపసుధాధిప! నీకెఱిఁగింతు నంతయున్. 269
క. ఆరీతిఁ దనదుపదములు, మారాంతకచరణముల గ్రమంబునఁబడు నీ
రేరుహవదనప్పురుష,చారుకరాబ్జములుగాంచి శైలజ మదిలోన్.
తే. అద్భుతం బంది విభుఁ గాంచి యనియె నీశ!
సంతతము రెండుపురుషహస్తములు వచ్చు
చుండు నేఁ డిది యేమొకో యువిదకరయు
గంబు నరుదెంచెఁ దెలుపు నిజంబు గాఁగ. 271
చ అన విని శంకరుండు గిరిజాత్మజ కిట్లను నీంద్రమార డా
త్మసిరుపమప్రభావము క్షమన్ బసవానుమతింధరాధినా
థునకెఱిఁగింప బూని తనతో యరుహానసహస్తపద్మముల్
సినుఁ గొలువంగఁ బంచె నన నెమ్మదిఁ బార్వతి సంతసింపుచున్. 272

ఉ. దీనజనానురాగ భవదీయపదార్చకసన్మహత్వముల్
పూనినుతింప ధాతృఫణిపుంగవజీవులకైనశక్యమే?
మానితసత్యసంధులసమానతరోరతుల ద్రిధైర్యులం
హీనిచయాపహారులసమున్నతి తేజులునీతికోవిదుల్. 273
చ. అని కొనియాడుచుక్ గిరిజయాత్మలినీలకచోమృతంబులో
కనికర సన్నుతాద్భుత సుగంధము బంధురపాండురప్రభా
వినికృతహంసమైనసురవృక్షసుమస్నిహదామమప్పుడా
ఘనకర యుగ్మయుగ్మమున గట్టిగఁజుట్టి ప్రియుండు నవ్వఁగన్. 274
ఉ. అంతటఁ దత్కరంబులు శివాంఘ్రులు సన్నిధినుండి ధాత్రికిన్
వింతగవచ్చి నభ్రపదవిం బరివేష్టితపారిజాత పు
ష్పాంతర సింధుపారణసమాగతషట్పద బృందఝాంక్రియా
కాంతదిగంతరంబులైనరాజముఖ్యులు ర్వీఅగందిచూడఁగన్. 275
క. ఆరీతి వచ్చి తత్కర, వారిజయుగయుగము పూర్వవైఖరియపుడా
మారనికి నతనిసాధ్వికి, ధారుణిజనులెల్లఁజూడ దయిలివెలింగెన్.
చ. అది గని బిజ్జలావనితలాధిపుఁడద్భుతసాధ్వసత్రముల్
హృదయములోనముప్పిరి వహింపఁగ శ్రీబసవేశుఁగాంచి యీ
సదమలచిత్తుసన్మహిమ స్వాంతమునన్ దెలియంగలేకనే
బదరితి కొన్నిమాటలవి పాటియొనర్పక నన్నుఁబ్రోవరే. 277
చ. అని వినుతించి మ్రొక్కుచు ధరాధిపుఁ డాత్మగృహంబుఁజేరునం
త నచటిభక్తపర్యులుముదంబునమారనిగాంచిబాగురె
ఘనతరభక్తినిష్ఠలకుగాయజుసంహారసత్కృపారతిం
గనుటకు నీవె మేటి వికగల్గుదురె నిన్నుఁబోలువారిలన్. 278
చ. బసవనిదూరనాడుజనవర్యుఁడులజ్జనహింపలోకము
ల్విసువక సన్నుతింపనిజవిశ్రుతకీర్తిలతావితానము
లైసలనలంకరింప గణధీరులకెల్లనుసంతసంబుమా
నసముఁనింపని త్తఱిగనంబడచేసితి నీమహత్వముల్. 279
వ. అని పెక్కువిధంబులఁ బ్రస్తుతింపుచు బసవేశ్వరప్రముఖభక్తులాత్మ
నివాసంబులం జెంది రట్లుగావున వీరభద్రా నీపాలా! యితని మహి
మం బెత్తెఱంగు. 280

క. ఈయాంద్రమూరయ చరిత, పాయకసద్భక్తి వినిన బఠియించిన దీ
ర్ఘాయువునారోగ్యశ్రీ, శ్రేయస్సంతానవృద్ధి జెందు నరుఁ డిలన్. 281
వ. అదియునుంగాక. 282
చ. సుజనహితంబు సద్వ్రతము సూన్రుతవాక్యము శాంతవృత్తి భా
వజరిపు పాదభక్తి గణవల్లభ దాస్యము దివ్యబోధ స
ర్వజనవశీకరంబుగతరాగత నైజగుణంబు లౌటచే
నిజగుణధాముఁ డయ్యె ధరణీస్థలి నీతఁడు మానవేశ్వరా!. 283

## గుణీంద్రుని కథ.

వ. ఇమ్మహాత్ముండు కల్యాణగుణంబునం దనుదినంబు. 284
క. రేవణకప్పెంకత దా, జీవంబునఁ దాల్చి భక్తసింహుల యిండ్లం
బౌసనభిక్షముఁగొని నై, జావాసము జెంది దాననక్షయలీలన్. 285
ఉ. వచ్చినజంగమావళి కవారితభక్తి భుజింపఁ బెట్టుచున్
సచ్చరితుం డితం డనుచు సర్వజనంబులు సన్నుతింపఁగా
తెచ్చిన ఖ్యాత వర్తిక గణేతరులెవ్వరు వేలసంఖ్యలై
వచ్చిన నిష్టభోజనముల వారలదన్పుచు నుండు నంతటన్. 286
చ. జనపతి తత్క్రమంబు విని నైఁపకదుర్మతి నా గుణాఢ్యవం
చన మొనరింప బూని యెకసక్కముగా బసవేశుతోడ ని
ట్లనియె మహాత్మ! యిప్పురము నందొక భక్తుడు వేలసంఖ్యవ
చ్చిన మనుజాళి కీప్సితముచేకుగ నట్టు మనోహరాన్నమున్. 287
క. అసివింటినదియెనిక్కమొ, యనృతమొ? బసవఁడనియె నవనీశ్వర నీ
వినినంత మట్టుసత్యఁ, బనఘాత్ముండతనిమహిమయఁ వియెతఁపన్.
చ. కరమునఁబట్టి భిక్షగొనుకప్పెర గొప్పదిగాదు మానెడా
టరు దది నిండ తండులము లన్నాల నెవ్వరివేడ కింటికిం
బరుగున వచ్చి సద్గురుక్ష పాంతి యక్షయమైనవాటినో
గురుతుగ కోటిసంఖ్యజనకోటుల కాతఁడు బెట్టు నన్నమున్. 289
వ. అనిన నమ్మహీశ్వరుం డి ట్లనియె.
తే. అట్టుఁయనసంతతాన్న దానవ్రత, నిష్ఠుఁడై చరించు నిజగుణీంద్రు
మందిరమున గుడవ మాక్షిప్తమైనది, నేడుపోదమనిననృపతిఁగాంచి.
చ. బండరిపళ్ళెనో మనుజవల్లభ! నీకెటు దోచె నట్లపో

దండరు దెండిపాగ మది దార్కొనుకూహకు మీఱ లేయు దం
దండరథాశ్వవీరభటదానసుహృజ్జనబంధుయుక్తుఁడై
దండిగ నేగుదెంచె వసుధావరుఁడా బసవండుతోడరాన్. 292

తే. అటుల తనయింటి కేతెంచు నవనిజాని
బసవనామాత్యుఁ గనుఁగొని ప్రమదమాత్మ
నలరె నెదురేగి నిజగుణి యచటభక్తి
నికరములకెల్ల కేల్మోడ్చి నిలుచు నంత. 293

ఉ. ఆతనిఁ గాంచి పల్కె బసవన్న మహాత్ముఁ ధరావరుండు నీ
ఖ్యాతికిఁ బ్రీతిఁ జెంది భవదాలయమందు భుజించు వేడ్కచే
నీతరి వచ్చినాఁ డితని యీప్సితముల్ ఫలియింపఁ జేయవే
పాతకజాతదుర్విపినపావకతావకభావమేర్పడన్. 294

చ. అనిన మహాప్రసాద మని యంతరిఁ దోడ్కొనిపోయి మున్నుగా
ఘనతరభక్తిచే శరణకాండసమర్చలొనర్చి పిమ్మటన్
వననిధిఁ గాంచి భక్తపరివారముతోడను భాసనంబులం
దొనరఁగఁ జేసి దివ్యమహిమోన్నతిసద్గురు సంస్మరింపుచున్. 295

మ. కదళీరాజనఖాజపంక్తు లమరంగా నైచి యంతర్భృతం
బౌదనశాకశలాటిసూపరసభక్ష్యాఖాద్యహయ్యంగవీ
న దధిక్షీరసమేతపాండుకలమాన్నం బల్లు వడ్డింపనే
మెసఁగన్ భుజియింపముల్ గొనిరి భూమీపాలసం[illegible]దిగిన్. 296

దండకము. ఈరీతి తజ్జైను లానోణింబొప్పగాఁ జేయుచుం దారు న
మ్యోక్తులిం బొంకఁగా నొండొరుల్ సారె నీభక్తవర్యప్రధానంబు
లెక్కింప వాక్కాంతినీనాథ ముఖ్యామరుల్ శక్తులే పూని నాఁ జేయు
చున్నట్టియా నాయకం బెంత యీవచ్చి కూర్చున్న సంఘంబు సంఖ్య
న్విచారింపఁగా నెంత మువ్వారి కెవ్వారి నేతీరుగా నిష్టమౌనట్టి చందం
బు సంప్రీతిఁగా వేడి వడ్డించె నౌరా భళీ బాగు మేలా యనె నిట్లుండవ
ద్ధానెతాంతానదాసక్రమంబంచు నీరీతిగా భోజనం బబ్బునం బిం
చుకంతైనముం దోఁచఁదాయంగ దాయింట నేసంశయం విసర్జించి యే
తెంతు నంచున్ మహిన్ దోమ్మయై వేయువర్షంబులున్నంతకం టెన్

గజంబై ముహూర్తంబ వర్తింపమేలన్న నందంబునన్ హీనమాజైన
వంశంబునం బుట్టి యేభోగము న్నేక చింతింపుచున్ బెద్దకాలంబు
జీవించుకంటెన్ క్షణంబైన భక్తాఢ్యుఁడై యుండుట శ్రేలటంచున్ మ
రిం గుత్తు కంటంగ భక్త్యావళుల్మెక్కి సంతృప్తి లేకయ్యయో! నెత్తిపై
నోరుగల్పించితే నింకనుంగొన్ని భక్షింపనచ్చున్ గదా యట్టుగా
నేటికిన్ జేయఁడా బ్రహ్మ పాపాత్ముఁడంచాతనిం దూరుచుం గూని
పాండ్యుండు నాసాంఖ్యతోండాహ్వయుండాదియూవార లీజైనవం
శోద్భవుల్గారె? మారారి భక్తాఢ్యులయియంత వారైరి యారీతినీ జా
ద్ధవంశాభిమానంబుఁ బెన్నీటిలోముంచి యేడాదిగా వీరశైవంబుచే
కొందమంచున్ వివాహంబులున్ పండుగన్ బబ్బముల్ మున్ను
మాయిండులన్ జేయుటల్లేదొ! యీవస్తుజాలంబులన్ దండిగా వండ
లేదో! భుజింపంగలేదో! యహా! యిట్టిసౌకర్య మేమెన్నఁ డుంగంటిమే
వీరిచేనైనపాకంబు తీరిట్టిదో లేక శ్రీకంఠభక్తాళిగేహంబులందంత
టన్ సౌష్ఠవంబిట్టుగానుండునో యంచు నౌనట్టిసౌఖ్యంబునం దా
సగిల్కొంటచేకదా సర్వదేశాగతానేకభక్తావళుల్ లక్షయత్తొం
బదార్వేలు బండారి యిల్వెళ్లఁగా లేక యేచోటికిం బోదురు రండు
రండంచుచుం వడింగేరుచున్ ద్వారందెం డటంచున్ నురంబెత్తికొం
చున్ జరంబయ్యెనంచున్ శిరంబంటికొంచున్ గడుందియ్యమంచున్
వడిన్ బావుకొంచున్ గదన్ జూచుకొంచున్ న్మైదన్ ద్రిప్పుకొంచున్
గడుంజుల్లునం జుల్లుచున్ గల్లునం దేన్పుచున్ నిల్లునంసీల్గుచుం
వేడ్కతో బిజ్జలాధీశు పూర్వంబుగా నంపఉంభోజనం బొప్పఁగాఁ
జేసి యప్పిమ్మటన్. 297

క. నిజగుణసన్నుతిఁ జేయుచు, నిజగేహంబునకుఁ జని యె నృపతిలకుఁడువా
నిజనము లహాహా యనఁబూ, నిజగంబులు మెచ్చనితఁడు నెగడెన్ భక్తిన్.

### మీమాంసుని కథ.

చ. అనియునువీరభద్రనసుధాధిపుతో నను నాగమాంబికా
తనుభవుఁ డీమహాత్మునికతంబున నయ్యె మదీయమాతులా
వనివరదేశికేంద్రులకు వాద మదెట్లన బిజ్జలుండువో
యునిజగుణేంద్రు నింటభుజియించుటఁ దా నతికోపచిత్తుఁడై. 298

శా. మీమాంసుం డిదియేలకో తలఁప నీభూనాథుఁ డాత్మీయమం
శామంత్రక్రమ మెల్లమిన్నకయె మాయంజేసి దుశ్చేష్టుఁడై
కామించెన్ శివభక్తులిండ్ల గుడుపంగా నిట్టి దుర్వర్తనం
బేమాన్పింపకయున్న పాపమగునా కిప్పట్టునం చెంతయున్. . 300

చ. సరగుననపైనమైబలసి ఛాత్రసహస్రము గొల్వఁ బుస్తకో
త్తరభరభృత్యకారుల్ నడువఁ డమ్మట కాహళశంఖభేరికా
దిరవములుల్లసిల్లఁ బరవీరభయంకరమైతనర్చు మే
ల్చిరుచవితాన మొప్పవెడలెం గురు డందలమెక్కియుక్కునన్. 301

శా. ఈరీతిన్ జను దెంచి భవ్యతరకల్యాణాంతికోద్యానవి
స్ఫారాక్షోణితలంబున న్విడియ నవ్వార్తల్ ధరానాథుతో
చారుల్ దెల్పినలేచి యప్పుడుసుహృత్సంఘంబుతో వేగస
చ్చారుండై చనిచొచ్చె సూర్యకిరణాసాధ్యోపవన్యంతమున్. 302

వ. చొచ్చి చనిచని ముందట. 303

చ. కనుఁగొనె నేలతేఁడుమణికాంచనభూషణభూషితున్ మృగా
జనయుతుఁ గోపిచందనవిశిష్టసమంచితఫాలుఁ గఱుదే
శనిరుపమేంద్రజాల మనుసంచయసంపుటు నంగలిప్తచం
దనుస్ఫటికాక్షమాలు గుణధాము నసాముఁని నైజదేశికున్. 304

ఉ. కాంచి నమస్కరించి మణికాంచనముఖ్యము లైనవస్తువుల్
సంచితభక్తి మ్రో[illegible]నిక సన్నముఁ [illegible]చి [illegible]తండు చిత్తమం
దెంచమనీయ భక్తి[illegible] నేమ[illegible]ముఖంబు నొంది మ
త్తాంచితహార [illegible]యుక్క[illegible] ప్రియంబు[illegible] [illegible]నతోడ నిచ్చినన్. 305

చ. అదియురుతం ధరించుకొని [illegible]నురుపస్యనిభ ద్రవంతిపై
ముకమున[illegible]క్కఁగా బసిచి [illegible] [illegible]చనవేత్రహస్తుఁడై
పక[illegible] [illegible]సం [illegible]సంగను [illegible]నంబు [illegible]దా న[illegible]ల్పుచున్
సపనము జేరవచ్చి మణిసౌధమున న్నసి[illegible]ంచె భక్తితోన్. 306

తే. సింహపీఠంబునందుంచి [illegible]ంత నర
మైన గద్దియ తానున్న య[illegible]స[illegible]మున
బసవఁ డేతెంచి నిజపీఠమునవసింపఁ
గాంచి మీమాంసుఁ డాత్మలో [illegible]నులు[illegible]దు[illegible]. 307

చ. నరవరుతోడ నిట్లనియె నన్గని మ్రొక్కఁగ మ్రోలిగద్దెపై
సరగున గూరుచుండె మదిజంకొకయించుక లేక యోగి యో
గురువరుఁడో యితండు ప్రతికూలునిరాజసభాంతరంబులన్
దిరుగుచునుండ నీవగునె తెల్పుము వీఁ డెవఁడన్న నమ్రుఁడై. 308

ఉ. దేశికసార్వభౌమ! గణియింపఁగ నీతఁడు మర్త్యమాత్రుఁడే?
పాశుపతాగ్రగణ్యుఁ డరిభంజనుఁ డాశ్రితపోషణుండు భా
షాశరదిందు సన్నిభయశఃపరిపూరితదిక్తటుండు పం
చాశుగదుర్వికారహరుఁ డంచితసూనృతవాక్యుఁ డిమ్మహిన్. 309

సీ. తనయిల్లు దోఁచవచ్చిన తస్కరులు గాల్చు
వంగకాయలోనర్చె లింగములుగ
జంగమం బడిగిన ముంగలిజొన్నల
రాశి ముత్యములుగాఁ జేసి యొసఁగె
బండార మొకమిండ భర్తునకిచ్చి య
ప్పటిగతినాకు గన్పడఁగఁజేసె
వాదించి సభవెలి వాఁడభక్తుఁ కేలి
నేలజాలై పాఱపాలుపితికె

తే. చల్లలమ్ముచు పురవీధిగోపపడతి
పంకమునజారి యొఱఁగుచో బసవయనుచుఁ
బల్కనిటనుండి పడకుండఁబట్టెదాని
నితని మహిమపథం బిట్టి దిదియఁగాక. 310

చ. శాత్రవలోకసంచయము సల్పి చతుస్సరిధీసమధ్యయా
థాత్రికివేడ్క మీఱ నను దక్షునిఁ గా నొనరించి మారభి
ద్గోత్రశశాంకహీరశరకుండలినాథ సదృశకీర్తికిం
బాత్రునిఁజేసి మాన్ప బసవండితఁ డెన్నినమంత్రిమాత్రుఁడే. 311

క. ప్రతివాదిభయంకరుఁడూ, ర్జితశాంభవభక్తి ధనుఁడు జితషడ్వర్గుం
డితనిని సామాన్యజనుని,గతిచుల్కఁగమీరు చూడఁగావలవనినన్.

ఉ. వాలముదొక్కఁబడ్డ ఫణివై ఖరినాజ్యముపోయ భగ్గనన్
జ్వాలలుగ్రక్కు తీవ్రశిఖిచందమునన్ గనలొంది యోరి! భూ
పాలకయంటి వీవు పరవాదిభయంకరుఁ డా యితండు చాల్

చాలుమదీయ సన్నిధివశం బగు నేనుడువెత్తదీనికిన్. 313

తే. వేదవేదాంతశాస్త్రాగమాదులందు
మంత్రతంత్రౌషధక్రియామహిమలందు
చోద్యమాయింద్రజాలాదివిద్యలందు
నాకుసరివారుఁగలరె? భూలోకమునను. 314

క. ఏనిత్యవలనదానా, తోవాదించఁగలఁడనుచు దండేశునిది
క్కై వెసఁదిరిగి మహాప్రభావం జేర్పడఁగవైచె వాకట్టిలిపిన్. 315

వ. ఇట్లు వైచిన. 316

క. మనమునఁనించుకఁగొంకక, కనుఁగొనలఁ నవ్వి తనదుకట్టెదుటవసిం
చిననందికోలశాంత,య్యనుఁగనిబసవయ్యసైఁగనటుఁజూపుటయున్.

సీ. అలిపిపత్రికయాతఁడున్గై కొని కొం కొకింతయులేక గోటిఁజె
మీమాంసుఁడదివో వతామసంబున చెడకట్టివైచినదానిగాలమునరె
గడువడిక్రమ్మడి కనుకట్టువైచిన బుస్సున నెగనూది పోవఁజేసె
యిట్టితోల్కట్టదండేశుని మర్దింపవైచినశాంతయ్యచూచి తనదు

తే. పాదరక్షలు వదిలినమీఁదికెగసి
యొకటియాకట్టు హరియించె నొకటివాని
మోముపైఁబడి పండ్లూడ మోదె సభికు
లెల్ల విస్మయచిత్తులై యల్లడింప. 318

క. ఆదెబ్బకుమీమాంసుఁడు, మేదినిఁబడి మూర్ఛఁజెంది మెల్లనవనకే
లూనుకొనలేచిబసవని, పాదంబుఁ మీఁదవ్రాలిప్రణుతించెనిటన్.

ఉ. మారటరుద్రమూర్తియసమానజగత్స్ఫురితాచ్ఛకీర్తిదు
ర్వారకళాప్రపూర్తి నినువర్ణన సేయఁగ నెవ్వఁడోపు నీ
చారుమహత్త్వముల్ దెలియఁజాలక నెగ్గొనరించినాఁడ నా
నేరము లెల్లసైచి కరుణింపఁగదే శరణాగతావనా. 320

క. దోషాచలనుగసంహార, శేష నిజమహిమంబు దెలియఁ జాలుగకష్టుఁడై
దూషించి భద్రఁజేగసి, పూషుని గతినన్ను జెంచెభూసుతపీఠేన్. 321

చ. అని వినుతించునాతని దయంగని శ్రీబసవండు ఓజ్జలేం
ద్రుని యెడవీడు కోల్పడసితోషము మీఱఁగ నంది కోలశాం
తుని మదిమెచ్చుచుం గృహాగతుం డగుచిమ్మటరాజదేశికుం

డునచట వేడుకఁ మదిఁ గడున్మదిఁ బర్వఁగ వేగన త్తఱిన్. 322

వ. మితశిష్యయుతుఁడై యసమతశుభకరం బైనబసవేశ్వరమందిరంబు నకేగిన నతనిరాక యంత ర్గేహంబుననున్నఁ దనతోఁడచారుం డొక్క రుండు మొ్రొక్కుచు సవినయంబున. [లాప

ఆ. తెలుపవచ్చి యిందుకొలువుకూటంబున, నతఁడు దాను ననునయాను ములవసించునంత నలుదెసఁగోడల, వ్రాసినట్టిభక్త వరులఁజూచి.

క. మీమాంసుం డచ్చెరువడి, స్వామీ! బసవేశ! యిట్టిసలలిత భక్తో ద్దామాకృతిగనుప్రతిమల, కేమహిజీవములుగలుగు నెటులుండునొకో!

క. అనవుడుదరహసితానన, మొనరఁగ నీకొక్క యటులనుండునటుల నేఁ గనుపించెద నిటుగనుమీ,యనిశరణొనరించిపిలువ నక్షణమాత్రన్.

క. కీలూడి పడినకైవడి, నేలకు దిగనురికి తోడనే జీవములుం గీలుకొన సందడింపుచు, కాలాంతక భక్తవర నికాయములంతన్.

సీ. జడముడుల్వీడిన సవరగామడుచుచు
జిలుగువన్నియల బొంతలు దులుపుచు
తళుకుమనెడు శూలములు లీలఁద్రిప్పుచు
పీవనలను మేను విసరికొనుచు
వాలుగడ్డంబులు కేలజాడింపుచు
మొలకట్ల కచ్చడంబులు జెలువుచు
జటిలమా రుద్రాక్ష సరములు విప్పుచు
కక్షపాలలు భుజాగ్రముల నిడుచు

తే. నిలచిన తదీయపదముల కెలమి మ్రొక్కి
మంత్రివర్యుండు నగుచు మీమాంసుఁ జూచి
తే యనిన నద్భుతంబంది యాయమాత్యు
నభినుతింపుచు నటగురుఁ డరిగె నంత. 328

క. బసవేశ్వరుఁ డప్పటిగతి, వసుధీశ్వర రాజ్యభార వహుఁడై గణప ద్విసరుహ పూజలొనర్చుచు,నసమాన మహత్వయుక్తుఁడై విలసిల్లెన్.

వ. అని యిట్లుచెప్పి చెన్నబసవేశ్వరుండు వీరభద్రావనీశ్వరునిలో మఱి యు ని ట్లనియె. 330

## కూలిచామయ్య కథ.

మ. గణవర్యుం డన వన్నె కెక్కె మహిమీఁకై కూలిచామయ్య స
ద్గుణవర్ణవ్రత సత్యవాక్యనిలస ద్గాంభీర్య శేషాహి భూ
షణపాదాంబుజ భక్తికామముఖ హృచ్ఛక్త్యష్టసంస్ఫారితో
ల్బణకీర్త్య న్వహదీనరక్షణకళా! ప్రావీణ్యసంపత్తిచేన్. 331

తే. అతుల ప్రఖ్యాతిఁ గాంచి కల్యాణమందు
నిత్య మీతండు భక్తుల నియమములను
చేతనగు కూలిపనిచేసి చేరుధనము
వలన జంగమపూజలు సల్పుచుండి. 332

క. ఒకనాఁడు రేపకడను, త్సుకలీలం బసవమంత్రిఁ జూచుటకై త
త్ప్రకటాలయబాహ్యద్వారకవాటసమీపచత్వరంబుననొకచోన్.

సీ. అచటనుండియయాంత యాతజనంబుల సంవడి కటునిటు జఱుగనేర
కొక్కింతనిలచి తానొయ్యననాస్థాన సదనముఁ జేరంగ జని యగణ్య
భక్తసముచ్చయ పరివేష్టితుం డగు బసవనిఁ గనుఁగొనఁ బడయలేక
యొడగల్గనిలచి యయ్యెడనున్న వారలఁ గనిదండనాథునిఁ గనఁగనీరు

తే. పూర్ణమగు కోశమంతటఁ బొదివికొనిన
మక్షికంబులకై వడి మాహ్యశులను
నెఁగుల నన్యాయ వీరి యిట్లు ఏగునే! యనుచు
నంబలువినంగ నాడ నయ్యవసరమున. 334

సీ. పినికొంచఱయ్యలు కనలుచుఁ జూచి వీఁ డెక్కడనుం డిటు నేగుదెంచె
నెవరు రానిచ్చి రీ మాహాత్ములనెల్ల నలక్ష్యంగా నియింపఁ బలుకఁ జొచ్చె
నౌ కూలిమాటలు గావనకున్న నీఁ డేగతిబల్కునిం కెన్న డేని
గాన యిచ్చటనుండఁ గానీక వెడలింపు డని మెడపట్టితో యంగ వెడలి

తే. కన్నుఁగవ నీరుజారగ గనలి మిగుల, కలతమది దేఁప మోము వెల్వెలఁ బార
జేరివంచకతతిఁ జేరిచమటలుఁ గార, చని యువగగురూడ నిజనివాసంబుఁ జేర.

వ. ఇట్లు చని పరిభవచింతాడోలాయమానసుండై యేమియుం దోఁచక
నిజభవనాంగనప్రాంతస్థితశాండిల్య మహీరుహమూల వితర్దికనాసీనుండై యాత్మగతంబున. 336

చ. బసవనిఁ జూచి వేడ్కమది బర్వఁగనేనట కేఁగపోతి త
ద్వసతి వసించునట్టి గణవర్గము నేటికిఁ దూలనాడితిం
గసరున వారునన్నుడువఁగాఁబడి యుండఁగ మోసనేడయో
కుసుమశరారి నిత్యమగు కూలికిఁబాసితి మోసపోయితిన్. 337

ఉ. పాపము లేమియు న్వొదువజేసెగదా గణవర్గమెల్ల రు
ద్రాపరమూర్తియైన బసవాధిపుఁ జూడగనీక కొల్పులో
జూపర నస్వనాతనువు సృక్కటజేయుట కల్మికల్గు దా
రీపగిదిం దిరస్కృతివహింతురె ధారుణి ధారుణీరథా. 338

ఉ. ఏమిటఁబూజచేసె బరమేశ్వర యీబసవండు తొల్లి నే
నేమి కొఱంత జేసితి నభీష్టనిరంతర భాగ్యయుక్తిఁగా
నామహితాత్మునుంచి లఘులైన దరిద్రము సంఘటించి బ
ల్బాముల నొంచఁజేసి తిది భావ్యమె నన్ను గణాలిలోపలన్. 339

క. కూరిమి నెవ్వరుసిరిగల
వారలకే కూర్తురనెడు వార్తయె ధరపై
నారూఢమయ్యె నీ విటు,
గౌరీధవ నన్ను మిగులగాసియిడుటచేన్. 340

వ. అని యిట్లు పరమేశ్వరుఁ దూలనాడుచు సాయకంబున కలుఁగక జం
గమార్చనవిధిఁ దలంపక యుండె నక్కట. 341

శా. దండేశాలయమందు నెప్పటిగతిం దత్పూపకాకావళుల్
నంకంబూనినతండులప్రముఖముల్ వస్తువ్రజంబంతయుఁ
భాండాకంబుల నించునంతనవి గానంరామి విభ్రాంతితో
నుంకఁ నేఁజని తత్క్రియంబు దెలుప న్వీతాకుఁడై యత్తఱిన్. 342

ఉ. ఎన్నడు లేనివింత యిది యేమకొ యిప్పుడుగంటి లింగసం
పన్నగణేశ్వరప్రకర భక్త్యకృపారతియందుఁ దక్కువో
నన్నరలేదు తొల్లియిది యద్భుతమై కనుపట్టె యేమి కా
గున్నదొ? యింకమీఁద శరణో హితకృత్యము లేమితప్పునో!. 343

సీ. అయ్యలఁగొలగనునంతనె నెదురేగియడుగులఁ కొఱగనో యర్ఘ్యపాద్య
ములొసంగనో పీఠములనిల్పనో నేమములు దెలియంగనో యనఁగలుగు
తలపులీడేర్పనో పంపినపనిసేయనో రుచికరముగాసారభోజ

నమొనర్పఁ జేయనో సుమదామ చందన తాంబూలములసమ్మదంబునొంద
తే. సలుపనో హంసతూలికా శయ్యల శయ
నింప జేయనొ తత్పదనీరజంబు
లొత్తనో యేమికతమొ భద్రవ్యోత్కరంబు
మాయమయ్యె గణార్చనా సాయమొదువ. 344
చ. అనియిటు చింతనొందుసమయంబునఁ జారుఁ డొకండువచ్చి వం
దనమొనరించి యోబసవ! తావకసేవక విన్నపంబు హృ
ద్వనజమునం బరాకిడక తాలిమితో విను విన్నవింతు నీ
దినమున నిప్పురంబునను ధీరుఁడు భక్తవరేణ్యుఁ డొక్కచోఁ. 345
క. మారేడునీడశివకరు,నీరోరుహమందునిల్పి నిగళద్బాష్పా
పూరితముఖుఁడై తతపణి, హారునిదూరుచుననించె నది యెట్లన్నన్.
చ. గురుతరమైనలేమి సమకూరిచి యెవ్వరికందరాని రా
సిరిగల దండనాథు గృహసీమకుఁబోవఁగఁ బంచి యచ్చటన్
శరణులచేతఁ దాడనమొనర్పఁగఁ జేసి వ్రతంబుఁ బాపి యు
ద్ధరననువల్కగాఁ గనుట ధర్మమె? నీకిది ధర్మపావనా. 347
చ. అనుచు వచించె నాబసవఁ డద్భుతమందుచు లింగదర్పణం
బునకయి కూలిచామయ విభుక్రమమంతయుఁ గాంచితప్పు వ
చ్చెనని తదీయయామభవనసీమకు సత్వరవృత్తినేకతం
బునఁ జని తత్పదాబ్జముల పొంత ధరాస్థలిఁ జాగిమ్రొక్కచున్.348
ఉ. నీవతఁ దోఁప నిట్లనియె దేవ కృపారసవృష్టిమీరు నన్
గానఁగవచ్చు టెనపుడు గానక మోసముఁ జెందినాఁడ నే
చొచ్చి ననుంబోలి దుర్మదవశుండు ధరాస్థలిలోన నల్గునే
జ్ఞానములేదు భక్తియును సౌజ్ఞ మెఱుంగ నిపేక్షింపు మన్. 349
ఉ. కావున నింకనైన దయఁ గన్గొని నాదగు తప్పులెల్ల యున్
నావలఁ దోఁచియేలు మెడ నైనగణార్చనవేళ దప్పఁ ద
ప్పావన జంగమావళిఘు థాన్యధఁ జిక్కఁ దదీయసేవ నా
జీవనమాట మీరు మును చిత్తమునందె యెఱుంగ లేదొకో. 350
వ. అని యిట్లాత్మనిందయు భక్తోత్కర్షంబు దోఁపనాడుచున్నఁ బసవేశు
నింగనిచామయ్యభక్తియుక్తుఁ గ్రమ్మఱనమస్కరింపుచుసిట్లనియె. 351

శా. దేవా! నన్నిటు పెద్దసేయఁదగునే దీనుండ మీపాద స
త్సేవాసక్తుఁడ మీమహత్త్వములు నాచేఁ జెప్ప శక్యంబె యీ
జీవాహీనులకై సమాద్యృశుల రక్షింపంగ సిద్ధాత్రిపై
భావప్రోద్భవసంహారాంశమున నుత్పన్నుండవై భక్తిచేన్. 350

క. సురమణి కన్నులఁ గేలం, బరుసము ధరియించి సకలభక్తాఢ్యసమున్
తత్కరములకీప్సిత మొసఁగుచు, ధర వెలసితివిట్టులొరులతర మె యొసర్వ

క. శరనిధులు మేరఁదప్పిన, గిరులు చరించినను నింగి క్రిందికొఱఁగినన్
స్థిరధైర్యకొఱఁతయగునే, యురుతరభవదీయమహిమ యొకచోనైనన్.

వ. అనిన విని వినయసల్లాపంబుల ననునయించి బసవేశ్వరునిజమందిరంబు
నకుఁ బోవం బనిచిన నతండు సంతోషితస్వాంతుండై యెఱింగి యం
తకమున్న యప్పటియట్ల యక్షయంబైనపదార్థంబులు గాంచి యచ్చె
రువందుచు తత్క్రమంబు వారలతో నుగ్గడింపుచు నుండె నిట చామ
య్యయుఁ దనసాధ్వీకిం దనవృత్తాంతం బెఱిఁగించి నిత్యకృత్యంబున
కేమి యింతప్రొద్దుజరిగెనని విచారింపుచు వీథికేగునప్పుడు దైవయో
గంబున నొకభక్తుండుతనయింటికిఁ గూలికింగొనిపోయి యప్పటి యా
తనిపడి యొసంగినఁ గొని తెచ్చి జంగమార్చనవిధిసలిపెఁగావున నితని
మహత్త్వం బిట్టి దని తెల్పి వీరభద్రనృపతింగాంచినం బసవేశ్వరుం
డిట్టి మాపథసర్తులైన జంగమమూర్తులలో నేనెంతవాఁడ నన్ను
మీ రిన్నిభంగులం గొనియాడం దగునే యనిన క్రమ్మఱ నతం డిట్ల
నియె. మహాత్మా! యిమ్మహాత్ములచర్యలు విని కృతార్థుండ నైతి.
కల్యాణంబున భక్తతృప్తివలన నాత్మతృప్తివహించు శరణుండు గలఁ
డని విందు నతం డెవ్వరనిన చెన్నయ్య మన్నించి యిట్లనియె. 355

సీ. ప్రతికూలభార్యయాకతననింటఁగణార్చ పొసఁగకచేన్నావఁ బోవునప్పు
డప్పురి నెదురైనయయ్యనొక్కనిగనిచనిమునుతాఁ దెచ్చుపత్రసాన్న
ములతద్ఘునినితృప్తిఁబొందించియీతనిఁదృప్తియేనిజలింగతృప్తిగాఁగ
వరలుకొన్నాళ్లిటుజరగఁగనొకనాఁడుతా వెంటఁగొనిపోవుశైవవరుఁడు
తే. కనులనొప్పిజనించినఁదనుపువిడ, నంద్రశ్రమనొందిననఁజాలకాత్మ దేహ
మొడలదలఁచిప్రత్యక్షమౌమృడుఁడదిశ, భక్తులనుగాచెఁగంగళపవిభుడు.

చ. అనియిటు శాంభవోత్తముమహత్త్వముఁ దెల్పుచు వేడ్కమీఱనా

దినమటుపుచ్చి యట్టిపగిది న్నిరతంబును భక్తపర్యగో
ష్ఠి నలరుచుణ్ శివార్చనము సేయుచు నచ్చట కొన్నినాళ్లు ని
ల్చెను బసవేశ్వరుం డనిన చెన్నసుధీశుఁడు సంతసించుచున్. 357

ఆ. అటులనుండితోడియయ్యలువీరభ,ద్రోర్విపతియుదానునొక్కనాఁడు
సముచితేష్టగోష్ఠినలుపుచుఁ దద్ధరా, వరునిఁజూచిచెన్నబసవఁడనియె.

ఉ. ఈశ్వర మూర్తియైన బసవేశుదయ న్నిముబోఁటి వీరమా
హేశ్వర పాదసేవన లభీష్టముఁ దేరఁగఁజేయఁగంటి నీ
విశ్వములోన జన్మములు వీడి కృతార్థుఁ డనైతి నింకనే
శాశ్వతమైన మోక్షపదసౌఖ్యముఁ జెందఁగనూహచేసితిన్. 359

చ. అనవుడు కేలుమోడ్చి వసుధాధిపుఁడిట్లను దేవ! మిమ్ము గ
న్గొనినది యాది నన్యమగు కోరికలెల్లఁ దృణీకరించి పా
వనభవసంస్మృతియుగ్మ మెడఁబాయకయుండఁదలంచినాఁడఁ గా
వున సహచారిఁ జేసికొని పుణ్యునిగా ననుఁగావవే దయన్. 360

క. శరణాగతజలవాంఛా, పరిపూర్తియొనర్చుటుచితపద్ధతిగాదే!
వరగుణులకెందునే మీ, వరవుడ నాకోర్కిఁదీర్ప నలదే! యనినన్.

చ. చిఱునగవాననాబ్జమునఁ జెన్నువహింపఁగనాగమాత్మజుం
డటిమిటిఁ బల్కు నీతలఁచినట్టుల యౌ నిఁక నేడువేవిన
న్మటిమటి చీకటింగణసమూహముతో నిటువెల్వఁబోక నం
దఱ మఱునా న్వెలెణ్ సునవితానను తామ్రత చెన్నఁజేరఁగన్. 362

క. అప్పెన్న నదీతటమున, నిప్పలభూజన్వయంబుఁ బెరిగెన నగు వె
ల్తిప్పకరుగసాధనమై, యొప్పుననుచుఁ జెప్పనృపతియుత్సుకుఁడయ్యెన్.

వ. అంత. 364

రజతస్తంభంబు కరుగుట.

క. చేసిన సమ్మతి నా గాం, గేయతనయుండు కల్యాణవర్తనల్లణ్
వేసారిగిచ్చి సహచరు, లాసాంగణాళితోడ నటఁ జెట్లనిలుచున్. 365

తే. సన్నుతంబైన వసుధలోనున్న నదుల
కన్నిటికి మిన్నయై తగియున్న యట్టి
చెన్న యున్నతి కఁచిన యన్నరాలి
కెన్నఁగా మోక్ష మబ్బెతి వెన్నగా రె! 366

ఉ. కావున నన్నదీవరము గన్ గొన వేడుకయయ్యె పోదమే?
పావనులార! యంచు నొడబాటొనరించి సమస్తభక్తులన్
గోవిదుఁడైన వీరనృపకుంజరుఁడుం దనతోడఁగూడి రాఁ
బావకసంభవాంశజుఁడు ప్రాభవమొప్పఁగ నేగె నత్తఱిన్. 367

వ. ఇట్లు చని చని. 368

సీ. ఆత్మాంబుసంస్మరణానందమానవ సంఘమకరంపెహాభుజంగనకుల
స్వీవనసందర్శనాసక్తజనస్తోమ పాపకాంధధ్వాంతభానుదీప్త
వైరిజనస్నాత్యవరలోకసప్తజన్మార్జితవృజినానిలానిలాశి
నిజతోయపాయిమనుజసముదయకృత పాపభూమీజాతపరశుధార
తే. పూరి సుకృతవంశోద్భూత భోగిమీన
కమఠనక్రజలూకకర్కటకముఖ్య
జంతుసముదాయవిహరణ స్థానమగుచుఁ
గన్నులకువన్నెఁ జెన్నొందు పెన్నఁ గనిరి. 369

మ. కని డాయం జనుసంతవీఁచెపయిఁ దత్కల్లోలినీతుంగభం
గనితాంతోక్షితశ్రీకరప్రజలరంగత్తుంగభూమాలతీ
కనకామ్రాదివసుంధరారుహసమాక్రాంతప్రసూనప్రభూ
తనిరాఘాటసుగంధబంధురజగత్ప్రాణాంకురవ్రాతముల్. 370

ఆ. అమ్మరుద్వ్రాతముల పథాయాస మపన
యించి యొకరమ్యతలమున నెల్లభక్త
వరులు దానును శ్రీచెన్నబసవవర్యుఁ
డెలమితోడుతఁ గూర్చుండి యిట్టు లనియె. 371

ఉ. భక్తవరేణ్యులార! ననుభవ్యకృపారతి మీరప్రసాదసం
యుక్తునిఁ జేసి యేకొఱంతయున్ ఘటియింపఁగనీక యేలుటన్
వ్యక్తిగ సర్వవాంఛిత సుఖానుభవంబులఁ జెంది తింక నే
ముక్తిపదంబుఁ జెందెద నమోఘముగా నెలవిచ్చిఁ బంపరే?. 372

చ. అనవుడు తద్గణాధిపులు హా! యిటులాడఁగఁ గూడునయ్య? సం
గన బసవేశ్వరుండు కడఁ గాంచినఁ బిమ్మట నీవె మాకు ది
క్కని యెద నమ్మి మోదమెలయన్ నినుజుట్టుకొయుంటి మట్లు గా
వున మము వీడి నీవాకడవుం జనుటొప్పునె? వెండికొండకున్. 373

త్తరువరుశాఖలఁ జెరణతండముతో హరుఁ డూఁగుచుండి భా
సురతనిజాగమం బెదురుచూచుచునుండె సుమానమేతుఁడై,

ఉ. ఆతఱివేడ్కఁ జెన్నబసవాధిపుఁ డాతరుశాఖలందు సం
భూతములయ్యెనో యన నపూర్వముగాఁ జెలువొందు నట్టి సం
ఘాతముగాంచి యోశరణకాండములార! భవుండు మీకు వి
ఖ్యాతిగఁబంపెఁగాంచనమయాసనముల్ గనుఁగొంటిరే యనన్. 385

చ. హరి గుహనాశ్రయించిన జనాళి కవారణమార్తికంబు వే
మరు భగవత్కటాక్ష విభవాతిశయంబునఁ జెందు మాకు శం
కరకృపఁగాంచు టే గణన గావునఁ బోదమె యంచుఁ దద్గణో
త్కరములు పల్కనత్తఱి మొగంబున లేనగ వంకురింపఁగన్. 386

వ. చెన్నబసవేశ్వరుం డున్నయంతకమున్న బసవేశ్వరుఁ గర్భంబుఁ
జొచ్చిన పిమ్మట కొందఱు భక్తవర్యులతోఁ గప్పడి సంగమేశ్వరం
బున వసియించిన నాగమాంబిక తనయుఁడు కైలాసగమనోన్ముఖుం
డగుట లింగదర్పణంబునం గని సంతోషబాష్పధారాపూరితశరీర
యై యెదురేగ నాయమ్మ యడుగులు తన ఫాలభాగంబు సోఁకం
బ్రణమిల్లినకుమారునిం గ్రుచ్చియెత్తి పెద్దవడవు కౌఁగిటఁజేర్చుకొని
మస్తకాఘ్రాణం బొనరించి బహుకాలవియోగదుఃఖంబుఁ బాసి
సంతోషించుచున్న జననిఁ దోడ్కొని పిప్పలాపాతంబునకుం జని త
ద్భక్తవరుల నందఱ నాలోకించి. 387

ఉ. ఓగుణులార! యెక్కడిదె యుయ్యలతొట్టెల నింక నిత్తఱిం
జాగొనరింపనేల? యని సంతసమొప్పఁగఁ దల్లి నొక్కడి
వ్యాగమనూనదామమయమై చెలువొందెడు తొట్టెనుండి వే
వేగమ వీరభద్ర పృథివీవరుతో నొక తొట్టెలోపలన్. 388

క. వసియించియంతఁదద్గణ,విసరారోహణముఁగాంచి విశ్వేశ్వర స[దెన్.
ద్విసరములు పలఁచునంతనె,యసదృశపూర్వవతారుఁడై చెలువొం

క. ద్వాదశమలు కేల్లన్నులు,మేదురముఖపట్టమును నమేయములోశ
క్త్యాదిసాధనంబులు,పొదుకొను వెలుంగుగుహలనిభక్తగణంబుల్.

క. కసి తోడనె పూర్వప్రమ,థ నికాయశరీర సమితిఁ బాల్చిరి శాపం
బునఁబాసినాగమాంబిక,యనుపమనాగేంద్రగమనయై చెలువొందెన్.

ఉ. నరహరి వైరిమంత్రనుత నాగలతాదళభక్షణంబుచేఁ
కురుపదకృత్రిమంబయినఁ గొంచముచే దగు త్రొక్కుఁడైనచోఁ
బరఁగఁగఁ బుల్లనౌ గృహ విభాషితలక్షణమైన తియ్యనౌ
ధరణిని మంత్రవేత్త లిటు తప్పకబోధలు చేతు రీయిలన్. 392

ఉ. కుండలిహారసూనుఁ డిదిగోఁ జనుదెంచె నటంచు వేడ్క నా
ఖండలముఖ్యనిర్జరనికాయము సంతసమొందె భేరికా
డాండరవంబులన్ సురజనప్రభవాక్షివిలాసనృత్యముల్
మండితపుష్పవర్షములు మాగధసన్నుతు లొప్పెమిన్నునన్. 393

క. అత్తఱి నద్భుతమొదవఁగ, దత్తరుయుగ్మంబు సురపదంబున కెగయన్
మొత్తముగ నింద్రముఖసుర, సత్తము లెదురేగుదెంచె సరగున నతులై

సీ. గజముపై ధ్వజమూని క్రతుభుగ్వరేణ్యుండు
ధూపపాత్ర ధరించె తోయజుండు
వేత్రహస్తుం డయ్యె చిత్రభానుసుతుండు
ఖడ్గంబు ధరియించె కర్బురుండు
జలకలశము దాల్చె సలిలాధినాథుండు
కేల వీవనఁగొనెఁ గీర్తిసఖుఁడు
బంగారుపావలు వట్టెను జేరుండు
నాటమార్గముచూపె శూలధరుఁడు

తే. పడఁగఁ గొడుగును పైవిప్ప పాఁపతేఁడు
స్వస్తి చెప్పంగఁ దొరకొనె జలజభవుఁడు
తోరణాకృతిఁ జెలువొందె తారకాళి
యమరసేనాని కైలాస గమనవేళ. 395

ఉ. ఈగతి షణ్ముఖుండు గిరిజేశ్వరుసన్నిధి కేగి నమ్రుఁడై
జోగిలి మ్రొక్క వారలతిసంభ్రమమొప్పఁగ నాత్మనందనుం
నేగమ గ్రుచ్చియెత్తి కనుఁగొందురెంచుచు కౌఁగిలించుచుం
రాగము మీఱఁ బల్మరు శిరంబులు మూర్కొనుచుండి రయ్యెడన్.

క. నాగేంద్రగమన తొల్లిటి, లాగున గిరిజాతఁ గొలుచు లలనలలో నంపెన్.
దాఁగలసియుం డెబ్రమథులు, నాగతిహరుఁ గొలిచియుండి రతిముదమొంగ

క. ఆపిప్పలతరుయుగ్మము, గోపతివాహానునిభక్తిఁ గొలుచుచుఁ దద్ద్వా

రోపాంతంబున ఛాయా, వ్యాపకమై నిలచెఁ బ్రమథు లచ్చెరువందన్.
క. అంతట నిట భూతలమున నంతంతట చెన్నబసవయారాధ్యుఁడు మా
కాంతుపురి కఖిలజంగము, సంతతితోఁ దనువులిడక చనె ననువార్తన్.
క. విని యొండొరులతో నపుడి, ట్లని రాహా! యిట్టిచిత్ర మవనింగలదే
తనువులతో శివపురికిం, జనుటొప్పునెయీతఁడెంతసద్భక్తుండో. 399
క. తానొకఁడె కాఁడు తనతో, మానక చరియించు భక్తమండలి నెల్లన్
బూని కొనిపోయినాఁడఁట, గానఁగ లేమైతిమతని గలసి చనంగన్. 400
తే. పసినిపండైన వృత్తంబు పట్టునీడు, గాక కసుగాయ కెంపైనఁ గలదె విశుట
తపసుపండిన వారితోఁ దగిలి చనఁగ, నేల సమకూరు మనబోఁటి హీనులకును.
ఉ. ఎన్ని భవంబులెత్తిన గిరీశుని సన్నిధి కిట్లు బోవఁగాఁ
జన్నె యితండు వీరనృపచంద్రు నిమోౖల వసించునాఁడె నీ
కన్నసమర్థు లెవ్వరికఁ గారు దురాత్ములఁ బ్రోవుమంచు నా
పన్నతఁ జేరికొల్చిన కృపావరుఁ డాతఁడు పీడ నాడు నే. 402
చ. వలదని మాన్చిన న్విడక వానికి ముక్కజని యొక్కరొక్కరే
చలదళశాఖపైఁ గోమల సందులసందుల డాగి వారలా
గొలుసులతోట్ల నెక్కి తరి గొబ్బున చేరులువట్టి ప్రేలినం
గలుగు గిరీశలోక మటుగాకయ వెఱ్ఱులమైతి మక్కటా! 403
చ. గురువుల నింద చేసితిమొ? కూడితిమో? యితరాంగనాగతిం
శరణులఁ గాంచి మ్రొక్కమొ? ప్రసాదములో రుచు లెంచినారమో?
పరధనకాంక్షఁ జెందితిమొ? పాసితిమో? వ్రతనిష్ఠ పార్వతీ
శ్వరునిసపర్య కాలమున సల్పమొ? భక్తిని భక్తిమార్గముల్. 404
క. ఆడితిమో? యన్నృతంబులు, కూడితిమో? యేరుమాలికుజనులపొందున్
పీడితిమో లింగార్చన, నోడితిమో యాంతరాహితోత్కరమునకున్.
క. కోల్చితిమో పెరవేల్పుల, సిలచితిమో శూలధరుని నిందించు నెడన్
నలచితిమో? దుర్వృత్తులు, విలచితిమో? వేదమంత్రవిద్యావితతుల్.
క. కాకున్న చెన్నబసవం, డాకాంక్ష న్మనలఁ గొంచు నరుగఁడె! యనిచిం
తాకులమతి నుండిరి భూ,లోకంబున నఖిలశరణులుం గడుభక్తిన్.
చ. సవమలమానసంబున రసాస్థలి యిక్కథ యెవ్వరేనియున్
జదివినవిన్న వ్రాసిన నిశాకరమౌళికృపా సమృద్ధిఁ బెం

పొదవంగ భోగభాగ్యములు పొంది చిరాయురుపేతులై తుదిన్
ముదమునఁ గాంతు రబ్జభవముఖ్యులకందని మోక్షసంపదన్. 408

వ. అని యిట్లు రేణుకగణాధీశ్వరుండు బాహుబలేయువృత్తాంతంబు సవిస్తరంబుగాఁ దెల్పిన కుంభసంభవుండు నచ్చటి మానీశ్వరులును సంతోషితస్వాంతులై దేవా! భవదీయకృపావిశేషంబున సమస్తసాధనహేతుకంబైన చరిత్రంబు వినఁగలిగెఁ గృతార్థులమైతిమని పెక్కువిధంబుల గొనియాడుచున్న వారల నుచితసల్లాపంబుల నీడ్కొని యయ్యోగిపుంగవుండు నిజేచ్ఛం జనియె నబ్బాసవాలుగనియు నేతత్కథాశ్రవణం బొనరింపుచు నెప్పటియట్ల సుఖంబుననుండిరి. 409

చ. వనరుహరాజతేజ! నరవాహన! కర్ణసమానదాన! పా
వన! శివలింగసంగ సురవల్లభ! మంత్రవిశేషభాషణాం
చన! నగవర్య! ధైర్య రిపుసంచయఖండనశౌర్యధుర్య! శో
భన! సుగుణాలవాల! కవిబంధుబుధాశ్రితజాలపాలకా! 410

క. కందర్పసదృశవితరణ, కందలకాంతాస్త్ర శీతకరనిభరూపా
కుందాభకీర్తిపూరము, కుందాగ్రజబాహుబల యమరశితవిభవా.

ఉత్సాహము. శర్వశర్వరీంద్రచంద్ర శారదాభ్రఫేనగో
పార్వమారుతాశనేశ హారహీరశారదా
పర్వతాధినాథగోప పాకశాబ్జతారకా
గర్వరాత్మజాతతుల్య కీర్తిపూరితోర్వరా. 412

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్షలబ్ధకవితానుమాధురీధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్యసాపసామాత్య ప్రణీతంబైన చెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము.



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1925.